# కమ్యూనిజం

జూన్ 1996

వెల : రు. 5/-

# కమ్యూనిజం

సంపుటి : : 21 ☼ జూన్ – 1996 ☼ సంచిక : 1

## ఈ సంచికలో :

విడి ప్రతి — రూ. 5/-

సంవత్సర చందా — రూ. 60/-

వివరాలకు : మేనేజరు, కమ్యూనిజం
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520004

---

"కమ్యూనిజం" పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో పత్రికా సంపాదకవర్గం ఏకీభవించనవసరంలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

—కమ్యూనిజం సంపాదకవర్గం

---

సంపాదకవర్గం

ఈడ్పుగంటి నాగేశ్వరరావు
(సంపాదకుడు)

పరకాల పట్టాభిరామారావు

# పునరంకితం

1975 మేలో ప్రారంభించబడిన ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి సిద్ధాంత మాసపత్రిక "కమ్యూనిజం" 1996 మేతో 20 సంవత్సరాలు పూర్తి చేసుకొని 21వ సంవత్సరంలోకి అడుగు పెడుతూంది. ఈ 20 సంవత్సరాలుగా కమ్యూనిజం పత్రికను ఆదరించిన పాఠకులకు, తమ అమూల్య వ్యాసాలను పంపి తోడ్పడిన రచయితలకు, అభ్యుదయ మేధావి వర్గాలకు, కమ్యూనిస్టు పార్టీ నాయకులకు, అలాగే పత్రిక ఏజెంట్లకు, మేనేజర్లకు, ప్రెస్ కార్మికులకు మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

మార్క్సిస్టు సిద్ధాంతాలను సృజనాత్మకంగా అభివృద్ధి చేసుకుంటూ వాటిని భారతదేశ విశిష్ట పరిస్థితులకు అన్వయించుకోవాలనీ, మౌలికమైన ఆర్థిక, సామాజిక మార్పుల ద్వారా సామాజిక విప్లవాన్ని, సోషలిస్టు సమాజాన్ని సాధించాలనీ అందుకు తగిన సిద్ధాంత పరిజ్ఞానాన్ని అందించాలనీ ఈ 20 సంవత్సరాలుగా కమ్యూనిజం పత్రిక నిరంతరం కృషి చేస్తూ వచ్చింది. అంతర్జాతీయ, జాతీయ పరిణామాలపై ఆర్థిక, సామాజిక సమస్యలపై అసంఖ్యాకంగా వ్యాసావళిని అందించింది.

గడచిన 5 సంవత్సరాల కాలంలో జాతీయ, అంతర్జాతీయ రంగాలలో అనేక అనూహ్యమైన పరిణామాలు జరిగాయి. 1991లో సోవియట్‌లోను, అంతకు ముందే తూర్పు యూరప్‌లోను సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి జరిగిన ప్రయోగాలు దెబ్బతిన్నాయి. అసలు శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాలు, మార్క్సిస్టు సిద్ధాంతాలే వైఫల్యం చెందాయని ప్రపంచ పెట్టుబడిదారీ వర్గ సిద్ధాంతులు బాకాప్రచారం చేశారు. దీనితోబాటు ప్రపంచంలో ఇంతవరకు ఎన్నడూ కనివిని ఎరుగని విధంగా శాస్త్రీయ సాంకేతిక విప్లవం వచ్చింది. అణుయుగంలోకి, కంప్యూటర్ యుగంలోకి మహత్తర ఎలక్ట్రానిక్ యుగంలోకి మానవాళి అడుగు పెట్టింది. ఇట్టి పరిస్థితులలో శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతాలను పునర్విమర్శించుకొని, మార్క్సిజాన్ని నేటి పరిణామాలకు అనుగుణ్యంగా సృజనాత్మకంగా అభివృద్ధి చేసుకొని అన్వయించుకోవలసిన అవసరం మరింత ఏర్పడింది.

1-6-1996

ఈ నేపథ్యంలోనే 1992 జూన్ 7వ తేదీన కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారు హైద్రాబాద్‌లో రాష్ట్ర పార్టీ కార్యాలయంలో పార్టీ మేధావుల, మార్క్సిస్టు మేధావుల సంయుక్త సమావేశం ఏర్పాటుచేసి సిద్ధాంతరంగంలో జరుగవలసిన కృషికి మార్గదర్శక సూత్రాలు రూపొందించారు.

మన దేశాన్ని మన ప్రజలను ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలపై మార్క్సిస్టు దృక్కోణంతో లోతైనఅధ్యయనం, పరిశోధన జరగాలనీ వీటిపైగోష్టులు, సదస్సులు నిర్వహించడం ద్వారా శాస్త్రీయ భావాల వ్యాప్తికి ఇతోధిక కృషి జరగాలనీ ఆ సమావేశం నిర్ణయించింది. కమ్యూనిజం పత్రిక ఈ కర్తవ్యాన్ని నిర్వహించడంలో ప్రధానపాత్ర వహించాలని కామ్రేడ్ సి.ఆర్. నిర్దేశించారు. రాష్ట్ర పార్టీ కేంద్రంలో ఒక ప్రత్యేక సిద్ధాంత విభాగం (Idealogical cell) ఏర్పాటు చేయటం కూడ అవసరమని ఆయన సూచించారు.

## మూడు రాష్ట్ర సదస్సులు - మూడు ప్రత్యేక సంచికలు

భారతదేశంలో కుల, మత సమస్యలు అలాగే మహిళలు, మైనారిటీల సమస్యలు తీవ్రరూపం దాల్చాయి. దీనికి మూల కారణాలు (roots) ఎక్కడ ఉన్నాయి? వేల సంవత్సరాలుగా మన చరిత్ర, సంస్కృతి, తాత్విక చింతన ఎలా పరిణామం చెందుతూ వచ్చాయి? ఈ విషయాల గురించి ఆమూలాగ్రంగా అధ్యయనం చేయనిదే ఈ సమస్యల పరిష్కారానికి మనం తోడ్పడలేము. ఈ దృష్టితోనే కామ్రేడ్ సి.ఆర్. మార్గదర్శకత్వంలో కమ్యూనిజం పత్రిక సంపాదకవర్గం చొరవ తీసుకొని 1992 సెప్టెంబరులో విజయవాడలో "భారతదేశంలో కులవ్యవస్థ" పై అధ్యయన సదస్సు జరిపింది. కామ్రేడ్ రాజేశ్వరరావుగారు స్వయంగా పాల్గొన్న ఈ సదస్సులో పార్టీ మేధావులు, మార్క్సిస్టు మేధావులు, చరిత్ర పరిశోధకులు, అభ్యుదయ రచయితలు, స్వాతంత్ర్య సమరయోధులు దళితవాద ప్రముఖులు, వివిధ కమ్యూనిస్టు గ్రూపులకు చెందినవారు పాల్గొన్నారు.

వారి ప్రసంగాలు, చర్చల సారాంశం కమ్యూనిజం ప్రత్యేక సంచికగా వెలువడింది. ఈ సదస్సు, ఈ ప్రత్యేక సంచిక రాష్ట్రంలో మేధావి వర్గాలలో మంచి స్పందన కల్గించాయి. ఈ ప్రత్యేక సంచిక మూడు ముద్రణలు వేయవలసి వచ్చింది.

అదే విధంగా సంపాదకవర్గ చొరవతో కాకినాడలో 1993 మార్చి 6, 7 తేదీలలో రాష్ట్రమహిళా సదస్సు జరిగింది. స్వాతంత్ర్యానంతరం స్త్రీల సమస్యలు, ఉద్యమాల గురించి కూలంకషంగా చర్చించడం జరిగింది. అన్ని రాజకీయాభిప్రా

యాలు కల మహిళలు, మహిళా సంఘాల వారు, విద్యాధిక మహిళలు పాల్గొన్నారు. ఫెమినిస్టు ఉద్యమ సమస్యలు, స్త్రీ విముక్తి ఉద్యమ పూర్వాపరాలపై సదస్సులో జరిగిన ప్రసంగాలతో, చర్చల సారాంశంతో తీసుకొనివచ్చిన కమ్యూనిజం ప్రత్యేక సంచిక, (ఏప్రిల్ 1993) మహిళా ఉద్యమాలకు ఒక కరదీపికగా ఉపయోగపడింది.

"భారతదేశంలో మతం" అన్న అంశంపై సంపాదకవర్గం ఆధ్వర్యాన హైద్రాబాద్‌లో 1993 డిశంబరులో జరిగిన రాష్ట్రస్థాయి సదస్సులో చరిత్ర పరిశోధకులు, తత్వవేత్తలు రామకృష్ణ మిషన్ ప్రముఖులు, హిందూ, ముస్లిం, బౌద్ధ, జైన మతాల ప్రతినిధులు పాల్గొన్నారు.

భారతదేశంలో మతం - నేటి మత ఛాందసత్వం గురించి ఇంత సమగ్రమైన చర్చ ఇటీవలి కాలంలో జరగలేదని చెప్పవచ్చు. ఈ సదస్సు ప్రసంగాలు, అనుబంధాలతో 1992 నవంబరులో ప్రచురించిన కమ్యూనిజం ప్రత్యేక సంచిక మేధావి వర్గాల విశేషాదరణ పొంది మూడు ఎడిషన్లు వేయవలసి వచ్చింది. కుల, మత సమస్యలపై ప్రచురించిన ఈ ప్రత్యేక సంచికలు విశేషాదరణ పొందాయి.

## వామపక్ష ప్రజాతంత్ర సమైక్యతా సదస్సులు

భారత కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలిక ఫలితంగా దేశంలో వామపక్ష శక్తులు బలహీనపడ్డాయి. కాంగ్రెస్‌కు ఒక ప్రత్యామ్నాయ శక్తిగా ఉండవలసిన కమ్యూనిస్టు ఉద్యమం ఇలా చీలిపోవడం వలననే కుల, మత శక్తులు ఇలా విజృంభించి కేంద్రంలో అధికారాన్ని కైవసం చేసుకొనే ప్రమాదం ఏర్పడింది. అందుకే వామపక్ష ప్రజాతంత్ర సెక్యులర్ శక్తులను సమైక్యం చేయవలసిన బృహత్తర కర్తవ్యం కమ్యూనిస్టు ఉద్యమంపై ఉంది. కమ్యూనిస్టు అభిమానులు, స్వాతంత్ర్య సమర యోధులు, మేధావి వర్గాలు ఈ లక్ష్యంతో విజయవాడలో (1995 ఫిబ్రవరి), హైద్రాబాద్‌లో (1995 సెప్టెంబరు), గుంటూరులో (1995 అక్టోబరు), కాకినాడ (1995 నవంబరు)లో జరిగిన వామపక్ష లౌకిక ప్రజాతంత్ర శక్తుల సమైక్యతా సదస్సులకు "కమ్యూనిజం" సంపాదకవర్గం బాగా తోడ్పాటు ఇవ్వడమే కాక సదస్సులలో ప్రసంగాల పూర్తి పాఠాలను ప్రచురించడం ద్వారా ఉభయపార్టీల వెనుకనున్న అసంఖ్యాక అభిమానుల ప్రశంసలను చూరగొంది. హైద్రాబాద్ సదస్సులో జస్టిస్ చిన్నపరెడ్డి, జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్ గారి ప్రసంగాలను కమ్యూనిజం పత్రిక ప్రచురించిన వాటిని వేల కాపీలు ప్రచురించి కమ్యూనిస్టు ఉద్యమ శ్రేయోభిలాషులు పంచి పెట్టుకోవడం జరిగింది.

1-6-1996

# గ్రామీణ ప్రాంతాలలో ఆర్థిక, సామాజిక మార్పులు

స్వాతంత్ర్యానంతరం మనం ఆశించిన విధంగా కాకపోయినా దేశంలో అనేక ఆర్థిక, సామాజిక మార్పులు వచ్చాయి. ఈ మార్పులను గుర్తించి, తదనుగుణ్యంగా ప్రజా ఉద్యమాలను, పార్టీని తీర్చిదిద్దుకోవలసిన అవసరం ఎంతో ఉంది. లేకపోతే ప్రజల దారి ప్రజలది మన దారి మనదీ అవుతుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో (Gross - root level) వచ్చిన ఈ ఆర్థిక, సామాజిక మార్పుల అధ్యయనం మన పార్టీ విధానాలను కార్యకలాపాలను రూపొందించుకొనడానికి, సాంఘిక సమస్యల పరిజ్ఞానాన్ని, పార్టీ కార్యకర్తల రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానాన్ని మెరుగుపరచుకోడానికి అవసరం. ఆ దృష్టితోనే సంపాదకవర్గం చొరవ తీసుకొని ఇందుకొక ఉపోద్ఘాతాన్ని, ప్రశ్నావళిని తయారుచేసి గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, నల్లగొండ జిల్లాలలో కొన్ని గ్రామాలను తీసుకొని ప్రాథమిక స్థాయిలో ఆర్థిక, సామాజిక మార్పుల పరిశీలన (నమూనా సర్వే) జరిపింది. ఈ సర్వేవలన ఎంతో అమూల్యమైన ఆర్థిక, సామాజిక పరిణామాల విశ్లేషణ లభించింది. ఇందుపై పార్టీ అధ్యాపకుల శిక్షణా శిబిరంలో ఒక అధ్యయనపత్రం సమర్పించడం కూడా జరిగింది. (1993 నవంబరు)

# చర్చావేదికలు

పాఠకుల ఆసక్తిని పెంపొందించడానికి, ఆయా సమస్యలపై చర్చలు ద్వారా పార్టీ కార్యకర్తల రాజకీయ పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేయడానికి సంపాదకవర్గం స్త్రీవాదంపైన, సామాజిక పరివర్తనతో యువత పాత్ర మున్నగు విషయాలపై నెల నెలా చర్చావేదికలను నిర్వహించింది. స్త్రీ వాదం అత్యధిక సంఖ్యాక స్త్రీల ఆర్థిక, సాంఘిక విముక్తివైపు గాక, పురుషాధిక్యతను వ్యతిరేకించడం ఒక్కటే ఏకైక లక్ష్యంగా ఎంచుకొనే పెడధోరణి పడుతున్న దశలో; వివాహ వ్యవస్థ, కుటుంబ వ్యవస్థ అక్కరలేదనే పెడధోరణి పడుతున్న దశలో స్త్రీ విముక్తి ఉద్యమ పూర్వాపరాలు వివరిస్తూ ఒక శాస్త్రీయ అవగాహన ఇవ్వడానికి ప్రయత్నించింది. ఈ చర్చావేదికలో పలువురు విద్యాధిక మహిళలు, అభ్యుదయ రచయితలు పాల్గొని ఆసక్తికరంగా నడిపించారు. చర్చను ముగిస్తూ సంపాదకవర్గ సభ్యులు వ్రాసిన "స్త్రీ విముక్తి ఉద్యమ పూర్వాపరాలు" అన్న వ్యాసం ప్రశంసలు పొందింది.

ఇదే విధంగా గుడిపాటి వెంకటచలం రచనలపై కమ్యూనిజం పత్రిక జరిపిన చర్చావేదిక పలువురను ఆకర్షించింది.

## పార్టీ పునర్నిర్మాణానికి కృషి-చర్చ

కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ పరిస్థితి అనేక అఖిల భారత, రాష్ట్రస్థాయి ప్రత్యేక సభలు, సదస్సులు జరిపినప్పటికి ప్రాథమిక యూనిట్ల నిర్మాణ పరిస్థితి, ప్రజా ఉద్యమాల నిర్మాణ పరిస్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉంది. 1993లో త్రిచూరులో జరిపిన నిర్మాణ ప్రత్యేక మహాసభ నిర్ణయాలను పురస్కరించుకొని "ప్రాథమిక స్థాయిలో పార్టీ యూనిట్ల నిర్మాణాన్ని అభివృద్ధి చేయడానికి తక్షణకృషి" పై సంపాదక వర్గం చర్చావేదికను ప్రారంభించింది. (1996 జనవరి)ఇందుపై పలువురు పార్టీ ప్రముఖులు జిల్లా కార్యదర్శులు చర్చలో పాల్గొని పార్టీ పునర్నిర్మాణానికి అనేక నిర్మాణాత్మకమైన సూచనలు చేస్తున్నారు. ఇంకా జిల్లాల బాధ్యులు, రాష్ట్రముఖ్యులు ఈ చర్చలో పాల్గొనాల్సిన అవసరం ఎంతో వుంది.

## ప్రశంసలు పొందిన ప్రత్యేక సంచికలు

భారతీయ తత్వశాస్త్రాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించడంలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన మార్క్సిస్టు మహోపాధ్యాయుడు శ్రీ దేవీప్రసాద్ చటోపాధ్యాయ ఆకస్మిక మృతి చెందిన సందర్భంలో ఆయన తత్వశాస్త్ర పరిశోధనల సారాంశాన్ని ఆయన రచనలనుండి ఉల్లేఖిస్తూ ఒక ప్రత్యేక సంచికను ప్రచురించాం. (1994 జూన్)భారతీయ తాత్విక చింతనలో మంచి చెడులను తెలుసుకోడానికి ఈ ప్రత్యేక సంచిక పార్టీ కార్యకర్తలకు, మేధావివర్గాలకు కూడా ఎంతగానో తోడ్పడింది.

అలాగే కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావుగారు కనుమూసిన సందర్భంలో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణం లగాయతు, సమైక్యాంధ్ర పరిరక్షణ వరకు ఆయన నిర్వర్తించిన చరిత్రాత్మక వీరోచిత పాత్రను తెలిపే ఆయన రచనలలో అనేక చారిత్రాత్మక ఘట్టాలను తెలిపే విశాలాంధ్ర ఫోటో స్టాట్ చరిత్ర పుటలతో 150 పేజీల ప్రత్యేక సంచికను (1994 జూన్) తీసుకువచ్చాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాణ చరిత్రను కళ్ళకుకట్టినట్లు చూపే ఈ ప్రత్యేక సంచిక పార్టీలోపల వెలుపల ఎంతో ఉత్తేజం కల్గించింది. ఒక చరిత్ర రికార్డుగా రిఫరెన్సుకు ఉపయోగపడే విధంగా ఎంతో సమాచారాన్ని ఇవ్వగల్గింది. పార్టీ సిద్ధాంత రంగంలో, రాజకీయ శిక్షణల రంగంలో ఎంతో కృషి చేసిన కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి, ప్రముఖ ఆంధ్ర చరిత్ర పరిశోధకులు బి. ఎస్. ఎల్. హనుమంతరావుగార్ల మృతి సందర్భంలో ప్రత్యేక వ్యాసావళి ప్రచురించాం.

బి. జె. పి, విశ్వహిందూపరిషత్తులు లేవదీసిన హిందూత్వ విష ప్రచారంపైన పుంఖాను పుంఖాలుగా ప్రత్యేక వ్యాసావళి ప్రచురించడం జరిగింది. అలాగే వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలపైన, వివేకానందపైన అనేక పరిశోధన వ్యాసాలు ప్రచురించాం.

చైనాలో ఆర్థిక సంస్కరణలు, మన దేశంలో లంచగొండితనం నిర్మూలనకు ప్రజా ఉద్యమం, మురికిపేటల రాచపుండు, పాలస్తీనా జాతీయ విముక్తి పోరాటం మున్నగు అనేక వర్తమాన సమస్యలపై ప్రత్యేక వ్యాసాలు కూడా వెలువడ్డాయి.

1995 సెప్టెంబరు 25, 28 తేదీలలో విజయవాడలో జరిగిన 19వ రాష్ట్ర పార్టీ మహాసభ సందర్భంలో వెలువడిన కమ్యూనిజం ప్రత్యేక సంచిక (1995 సెప్టెంబరు-అక్టోబరు) అనేక విధాల విశిష్టతను కలిగి ఉంది. ఈ తరం కమ్యూనిస్టులకు, యువతరానికి, అభిమానులకు కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రను, ఆంధ్ర ప్రదేశ్ పురోభివృద్ధికి కమ్యూనిస్టు పార్టీ కృషిని, యింతవరకు జరిగిన 18 రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభల చరిత్రను తెలిపే వ్యాసాలు యిందులో ఉన్నాయి. కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలు కామ్రేడ్స్ పి. సి. జోషి, అజయ్‌కుమార్ ఘోష్, నంబూద్రిపాద్, పుచ్చలపల్లి సుందరయ్య, రాజేశ్వరరావు మొదలగువారు ఆయా సందర్భాలలో వ్రాసిన అమూల్యమైన వ్యాసాలున్నాయి. రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ సమైక్య కార్యాచరణకు, వామపక్ష లౌకిక ప్రజాతంత్ర శక్తుల ఐక్యతకు జరుగుతున్న సదస్సుల ఉద్యమం గురించి సమగ్ర సమాచారం, పూర్తి ప్రసంగాలు ఉన్నాయి. రాష్ట్ర పార్టీ మహాసభ జరుగుతూండగానే రెండు, మూడు రోజులలో మొదటి ఎడిషన్ ఐపోవడంతో అప్పటికప్పుడు రెండవ ఎడిషన్ వేయవలసి వచ్చింది. మార్క్సిస్టు పార్టీవారు కూడా ఈ సంచికను కొని పంపిణీచేసి ఆసక్తితో చదివారు.

## కమ్యూనిస్టు ఉద్యమ వైతాళికుల సంక్షిప్త చరిత్రలు

1940 దశకంలో "నేనెలా కమ్యూనిస్టునయ్యాను?" అన్న శీర్షికతో ఆనాటి ప్రజాశక్తి ప్రచురణాలయంవారు కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చిన తొలితరం వారి సంక్షిప్త చరిత్రలను ప్రచురించారు. మళ్ళీ తిరిగి 1925–1995 పార్టీ 70వ వార్షికోత్సవ సందర్భంలో 1995 డిశంబరులో సుమారు 30 మంది కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలు తొలితరం, మలితరం కమ్యూనిస్టు నాయకుల సంక్షిప్త చరిత్రలతో కమ్యూనిజం పత్రిక ప్రత్యేక సంచికను ప్రచురించాం. కమ్యూనిస్టులు ఉత్తమ దేశభక్తులు, నిస్వార్థ త్యాగధనులు, నిర్విరామ ప్రజాసేవకులు అన్న విషయం నిరూపించే ఈ సంక్షిప్త జీవిత చరిత్రల సంచిక విశేషంగా

పాఠకులను, మార్క్సిస్టు మేధావి వర్గాలను ఆకర్షించింది. కొద్ది రోజులలోనే ప్రతు లన్నీ అమ్ముడైపోయాయి. పలువురు కావాలని అన్నా కాపీలు దొరకలేదు. ఈ సంచిక కమ్యూనిస్టు ఉద్యమ సంస్థాపకుల సంక్షిప్త చరిత్రలు యెంతో ఉత్తేజ కరంగా ఉన్నాయని భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో మానవతా దృక్పథంగల కమ్యూనిజం కోసం వీరు చేసిన త్యాగాలు చిరస్మరణీయమైనవనీ, త్యాగమూర్తుల కృషి విశేషాలు చక్కని శీర్షికలతో వివరించారని, ఇది చాలా అమూల్యమైన సంకలనం, ఈ తరం తెలుసుకోవలసిన సంగతులు చాలామందికి తెలియని సంగ తులు యెన్నో ఉన్నాయని పలువురు ప్రముఖులు అభినందనలు తెలిపారు. ఒక అర్థ శతాబ్దం ఆంధ్రదేశ రాజకీయ చరిత్రకు, ప్రజాతంత్ర విప్లవోద్యమాల చరిత్రకు ఈ సంచిక అద్దం పట్టడమే కాక, భారత జాతీయోద్యమం నిర్మిం చిన ప్రజా జీవిత సత్సంప్రదాయాలను, విలువలను జాతీయ పునరుజ్జీవనోద్యమ వారసత్వాన్ని కమ్యూనిస్టు నాయకులు యెలా కొనసాగించుతున్నదీ ఈ సంక్షిప్త జీవిత చరిత్రల సంకలనం ప్రతిబింబించింది. పలువురు మార్క్సిస్టు నాయకుల సంక్షిప్త చరిత్రలు ఇందులో ఉన్నాయి.

రాజకీయాలంటే పదవులు, ధన సంపాదన, ముఠా తగవులు, రౌడీ రాజ కీయాలుగా దిగజారిపోయిన నేటి హేయ పరిస్థితుల్లో-కమ్యూనిస్టు ఉద్యమ వైతాళికుల నిష్కళంక దేశభక్తిని చాటే విధంగా ఈ ప్రత్యేక సంచిక ఉందని సర్వత్రా ప్రశం సలు పొందింది.

## ప్రయోజన శాస్త్రీయ విజ్ఞాన పాఠాలు

నేడు తిరిగి మత మౌఢ్యం, ఛాందసభావాలు, మూఢనమ్మకాలు పెరిగి పోతున్న దృష్ట్యా పార్టీలోకి వస్తున్న కొత్త కార్యకర్తలకు, నేటి యువతరానికి శాస్త్రీయ విజ్ఞానం గరపవలసిన అవసరం యెంతో ఏర్పడింది. మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానానికి పునాదిగా జీవ పరిణామ సిద్ధాంతాలు, సమాజ పరిణామ సిద్ధాంతాలు, గతితార్కిక భౌతికవాదం మున్నగు అంశాలను ధారావాహికంగా పాఠాలు ప్రచురించుతున్నాం. ఈ పాఠాల సహాయంతో ఎక్కడికక్కడ పార్టీ ప్రాథమిక యూనిట్లు, ప్రజా సంఘాలు, రాత్రి బడులు, అధ్యయన కేంద్రాలు (స్టడీ సర్కిల్స్) జరపడానికి యివి ఉపయోగపడతాయి.

1992లో పార్టీ మేధావుల, పార్టీ వెలుపల ఉన్న మార్క్సిస్టు మేధావుల సంయుక్త సమావేశం జరిగిన తరువాత గడిచిన 3½ సంవత్సరాల కాలంలో కమ్యూనిజం పత్రిక వ్యాసావళిని పరిశీలించితే (సంచిక చివర ఇండెక్సు చూడండి) భారతీయ చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలపై మార్క్సిస్టు దృక్పథం నుండి

కృషిపిన పరిశోధన, అధ్యయన పూర్వకమైన అనేక వ్యాసాలు ద్యోతకమవుతాయి. నేడు దేశాన్ని ఎదుర్కొంటున్న కుల, మత, ఛాందసవాద శక్తుల ప్రమాదం గురించి హెచ్చరించే అనేక వ్యాసాలు కనబడతాయి. నేటి దేశ రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలో పరిణామాలను విశదీకరించే రచనలు, మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంపొందించే రచనలు కనబడతాయి. పలువురు మార్క్సిస్టు మేధావులు' చరిత్ర పరిశోధకులు, తత్వవేత్తలు కమ్యూనిజం పత్రికపట్ల ఆదరాభిమానాలతో తమ అధ్యయన పత్రాలను, పరిశోధనా పత్రాలను అందజేసి, నేడు ఆంధ్ర ప్రదేశ్‌లో కమ్యూనిజం పత్రికను ఒక అగ్రశ్రేణి సిద్ధాంత పత్రికగా తీర్చిదిద్దడానికి తోడ్పడ్డారు.

70 సంవత్సరాల కమ్యూనిస్టు ఉద్యమం ఈ దేశంలో మార్క్సిస్టు భావజాలం వ్యాప్తికి ప్రధాన పాత్ర నిర్వహించింది. నేడు ఉభయ కమ్యూనిస్టు పార్టీ లోపలకంటే బైటనే మార్క్సిస్టు భావాలు గల మేధావివర్గం అత్యధిక సంఖ్యలో ఉన్నది.

కమ్యూనిజం మాసపత్రిక పార్టీ లోపల వున్న మేధావి వర్గాలకు, వెలుపల ఉన్న మేధావి వర్గాలకు ఒక వారధిగా పనిచేస్తున్నది. అయితే ఇంకా పార్టీ లోపల ఉన్న నేటి తరం కార్యకర్తల సిద్ధాంత, రాజకీయ పరిజ్ఞానాన్ని పెంపొందించడంలో ఎంతో కృషి చేయవలసి ఉంది. రాష్ట్ర ఆర్థిక, సామాజిక రంగాలలో వస్తున్న పరిణామాలను మరింత సమగ్రంగా, లోతుగా అధ్యయనం చేసి ప్రత్యామ్నాయ ఆర్థిక, సామాజిక విధానాలను రూపొందించడానికి కృషి చేయవలసి ఉంది.

మార్క్సిజాన్ని నేటి పరిస్థితుల కనుగుణ్యంగా పెంపొందించుకొనే మహత్తర కర్తవ్య నిర్వహణలో కమ్యూనిజం పత్రిక తనవంతు బాధ్యతను శక్తివంచన లేకుండా నెరవేర్చుతూందనీ, పత్రికను మరింతగా అభివృద్ధి చేయడానికి సంపాదక వర్గం పునరంకితమవుతుందని మనవి చేస్తున్నాం. పత్రిక ప్రాచుర్యాన్ని మరింతగా పెంపొందించవలసిందిగా సర్వులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

సంపాదకవర్గం

# ఆచార్య నరేంద్రదేవ్ బౌద్ధ ధర్మ దర్శన్

## శ్రీ సంజీవదేవ్

మానవజీవితం ఒక మహోన్నత పరిణతి. ఆ పరిణతిధార మామూలుగా పైనుంచి క్రిందకు ప్రవహించక క్రిందనుంచి పైకి ప్రవహించింది. అది ఊర్ధ్వ స్రవంతి. ఈ పరిణతిధారకు అనేక మార్గాలు తోడ్పడ్డాయి. విజ్ఞానాలు, కళలు, మతాలు, దర్శనాలు మొదలైనవెన్నో ఈ పరిణతిధారకు వేగాన్నీ, పరిపుష్టినీ ప్రసాదించాయి. వీటిలో మతాలు సలిపిన సహకారం కొంత వెలుగునూ, కొంత చీకటినీ కలిగివున్నది; నిజానికి ఇందులో వెలుగుకంటే చీకటే ఎక్కువ భాగంలో వున్నది. ఈ పరిణతిధారలో తోడ్పడినవన్నీ మార్గాలుగానే నిలిచిపోదగినవి కాని గమ్యాలు కావు. ఒకనాటి మానవ జీవితానికి మతం కొంతవరకు అవసరం అయి వుండవచ్చునేమో కాని నేటి మానవ జీవితానికి మతం అవసరంలేదు. నేటి మానవ జీవితం మతాన్ని అధిగమించి మానవతలో ప్రవేశించింది. మానవతకు మార్గదర్శి హేతువాదం.

ప్రతి మతానికి తన స్వంత దర్శనం (Philosophy) ఒకటి వుంటూ వచ్చింది. కొన్ని మతాల దర్శనాలు పై పైవిగా మాత్రమేవుంటే మరికొన్నిటివి ప్రగాఢంగా వుంటూ వచ్చాయి. అటువంటి వాటిల్లో బౌద్ధం ఒకటి. ఇటువంటి బౌద్ధ దర్శనాన్ని గురించి రచించబడ్డ గ్రంథమే ఈ "బౌద్ధ ధర్మ దర్శన్" అనే హిందీ గ్రంథం. మహావిద్వాంసుడైన ఆచార్య నరేంద్రదేవ్ దీన్ని ప్రతిభావంతంగా రచించాడు. ఆచార్య నరేంద్రదేవ్ సోషలిస్టు నాయకుడుగా లోకానికి ఎక్కువ పరిచితుడు. ఆయన సాహిత్య జీవితంకంటే ఆయన రాజకీయ జీవితం ఎక్కువ ప్రఖ్యాతి చెందింది. జీవితంలోని కొన్ని బాధలు కొన్ని బోధలకు కారణాలవుతుంటాయి. ఆచార్య నరేంద్రదేవ్ జైలు జీవితం ఆయనకు మహోపకారిగా రూపొందింది. ఆయన అహమ్మద్‌నగర్ కోటలో రాజకీయ ఖైదీగా వుంటున్న సమయంలో కావలసినంత తీరికవుండటంవల్ల ఫ్రెంచ్ భాషలో వున్న "అభిధర్మకోశ" అనే బౌద్ధ దర్శన గ్రంథాన్ని హిందీలోకి అనువదించటం జరిగింది. అంతటితో ఆగక

నరేంద్రదేవ్ బౌద్ధదర్శనాలన్నిటిని అవలోకనచేయ ప్రారంభించాడు. వాటన్నిటి ఫలితమే ఈ "బౌద్ధధర్మ దర్శన్". ఈ గ్రంథంలోని విశిష్టత ఏమంటే బౌద్ధాన్ని గురించీ, బౌద్ధదర్శనాలను గురించీ మొత్తం అంతా ఒకే గ్రంథంలో రచించబడింది. ఇటువంటి సమగ్ర బౌద్ధగ్రంథం భారతీయ భాషల్లోకాని మరి ఏ విదేశభాషలలో కానీ లేదు. బౌద్ధదర్శనాలన్నీ మౌలికంగా ఒకే గ్రంథంలో లేవు. అవన్నీ విభిన్న గ్రంథాల్లో అస్తవ్యస్తంగా వున్నాయి. ఆచార్య నరేంద్రదేవ్ అత్యంత కృషిచేసి వాటి నన్నిటిని గురించి ఈ గ్రంథంలో విశదంగా విద్వత్పూర్ణంగా వివరించారు. ఆయన హిందీ శైలి బలీయమైంది. ప్రస్ఫుటమైంది. అభివ్యక్తిశీలమైంది.

## బ్రాహ్మణ శ్రమణ పంథాలు

ఈ గ్రంథం అయిదు ఖండాలుగాను, ఇరవై అధ్యాయాలుగాను విభజించ బడివున్నది. మొదటి ఖండపు అయిదు అధ్యాయాల్లో బౌద్ధం పుట్టుపూర్వోత్తరాలు, స్థవిరుల సాధనా విధానాలు వర్ణించబడి వున్నాయి. ప్రథమ అధ్యాయంలో భారతీయ సంస్కృతిలోని రెండు ప్రధాన ప్రవాహాలను గురించి వున్నది. బుద్ధుడు జన్మించే సమయానికీ దేశంలో రెండు ధార్మిక సంప్రదాయాలు వ్యాప్తిలోకి వచ్చి వున్నాయి. మొదటిది బ్రాహ్మణ పంథా, రెండవది శ్రమణ పంథా. మొదటి వారికి వేదాలు ప్రధానం, రెండవవారికి వేదాలు అప్రధానం. మొదటివారికి యజ్ఞయాగాదులుముఖ్యం, రెండవవారికి అవి అవసరం లేదు. అయితే వైదికులంతా ఆస్తికులే. శ్రమణులలో ఎక్కువ భాగం నాస్తికులు. తక్కువ భాగం ఆస్తికులు కూడా వుండేవారు. ఆనాటి ఆస్తిక నాస్తిక వాదాలను గురించి ఆచార్య నరేంద్రదేవ్ ఈ గ్రంథంలో నూతన వ్యాఖ్యానం చేయటం గమనించతగిన విషయం. ఆస్తికతకు నాస్తికతకు భగవంతునితో సంబంధం లేదని, భగవంతుని అస్తిత్వంలో విశ్వాసం వుండటం ఆస్తికవాదం కాదని, విశ్వాసం లేకపోవటం నాస్తిక వాదం కాదని, ఆ కాలంలో ఆస్తికవాదం అంటే పరలోకంలో విశ్వాసం కలిగివుండటం అనీ, నాస్తికవాదం అంటే పరలోకంలో విశ్వాసం లేకపోవటం అనీ. "నాస్తిపరలోకోయస్య నః" అనే ఆనాటి శాస్త్రవాక్యాన్ని గ్రంథకర్త ఉదహరించారు. ఈ వాక్యం మహావ్యాకర్త అయినట్టి పాణిని సృష్టించింది. అందుకే బుద్ధునికాలంలో భగవంతుని ఉనికికి అంత ప్రాధాన్యంలేదు. ప్రాధాన్యం ఎక్కువగా కర్మసిద్ధాంతానికి, పరలోక వాదానికి వుండేది. బుద్ధుని సమకాలికుడైన ఒక ముఠానాయకుడుగా ప్రసిద్ధిగాంచిన అజితకేశ కంబల్ అనే ఆచార్యుడు ఆనాడు నాస్తికుడుగా పేరు పొందేడు. అంటే ఆయనకు ఇహలోకమేకాని పరలోకంలేదు. మరణించక పూర్వంవున్న జీవితమే సత్యంకాని మరణానంతర జీవితంకాదు.

ప్రథమ ఖండంలోని మొదటి అధ్యాయంలో పైన పేర్కొన్న ఆనాటి రెండు చింతాస్రవంతుల విషయం మాత్రమేకాక బుద్ధుని ఆవిర్భావం, ఆయన సమకాలికులైన ఆచార్యులు, ధర్మప్రచారం బుద్ధుని అస్తమయం (పరినిర్వాణం) మొదలైనవి రచించబడి వున్నాయి. రెండవ అధ్యాయంలో బుద్ధుని ఉపదేశాల సార్వజనీనత, ఆయన మధ్యమమార్గం, ఉపదేశత్రయం, పంచశీలాలు మొదలైనవి వివరించబడి వున్నాయి. మూడవదానిలో ధర్మప్రచారానికి సంబంధించిన భాషను గురించిన చర్చ వివరంగా వున్నది. ఈ విషయంలో గ్రంథకర్త అంటారు-బుద్ధుడు ఆనాడు తన ఉపదేశాలను ఏ భాషలో ప్రచురించాడు అని ఖచ్చితంగా తేల్చటానికి తగిన చారిత్రకాధారాలు అంతగా లభించటంలేదని. బుద్ధఘోషుని అభిప్రాయం బుద్ధుడు ఆనాడు ఉపయోగించిన భాష 'మాగధి' అని, పాళీభాష మాగధిజన్యం అని. రీస్ డేవిడ్సు అభిప్రాయం ప్రకారమైతే బుద్ధుని మాతృభాష కోశలభాష అనీ, ఆ భాషలోనే ఆయన ధర్మప్రచారం చేశాడనీ, కోశల రాజ్యప్రభావం వల్ల ఆనాడు కోశలభాష ఢిల్లీనుంచి పాట్నా వరకు, శ్రావస్తినుంచి అవంతి వరకు వాడుకలో వున్నది. రీస్ డేవిడ్స్ అభిప్రాయం ప్రకారం కోశల భాషలోని వ్యావహారిక రూపంనుంచి పాళీభాష ఉత్పన్నమైందని.

గ్రంథకర్త బుద్ధుని భాషావిషయంలో ఒక నిర్ణీత అభిప్రాయానికి రాలేక పోయారు. భాషా విషయంలో బుద్ధుడు ఖచ్చితమైన ఒక మార్గాన్ని దేన్నీ అనుసరించలేదనీ, తన అనుయాయులందరకూ తన ఉపదేశాలను ఏ భాషలోనైనా ప్రచారం చేసుకునే అనుమతిని ఇచ్చినట్లు గ్రంథకర్త వివరిస్తారు. ఒకసారి బుద్ధుని శిష్యులిద్దరు బుద్ధునికి చెప్పారట బుద్ధ వాక్కులను ఎవరికి తెలిసిన భాషలో వారు ప్రచారం చేస్తున్నారు కనుక ఆ విధంగా చేయకుండా బుద్ధ వాక్కులన్నీ క్రమబద్ధంగా సంస్కృతంలో వుండేలాగా ఆజ్ఞాపించమని. కాని బుద్ధుడు అందుకు అంగీకరించక తన వాక్కులను ఎవరి భాషలో వారు ఉపయోగించుకోవచ్చని అనుమతించాడు. (అనుజా నామి భిక్కవే సకాయ నిరుత్తియా బుద్ధవచనం పరియాపుణిత్తు). వినీతదేవుని (క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దం) కథనం ప్రకారం అయితే బౌద్ధులలోని సర్వాస్తివాదులు సంస్కృతంలోను, మహాసాంఘికులు ప్రాకృతంలోను, సమ్మితీయులు అపభ్రంశంలోను, స్థవిరవాదులు పైశాచిక భాషలోను వ్యవహరిస్తుండేవారని.

ఏది ఏమైనా బుద్ధుడు భాషావిషయంలో ఏ అడ్డంకులనూ ఏర్పరచక తన అనుయాయులకు సంపూర్ణ భాషాస్వేచ్ఛ నిచ్చాడు. తన వాక్కులు ఏభాషలో వ్యాప్తి చెందాలనే దానికికాక ఏ భాషలోనైనా సరే సక్రమంగా, లోతుగా, వెడల్పుగా, మార్పు లేకుండా వ్యాప్తిచెందాలనే దానికి ప్రాధాన్యం ఇచ్చాడు. విషయం ప్రధానంకాని మాధ్యమం (Medium) ప్రధానం కాదని బుద్ధుని అభిప్రాయం. అయినా, బౌద్ధానికి సంబంధించిన ఎక్కువ సాహిత్యం పాళీ భాషలోనే వుండటం జరిగింది.

# నికాయం

ఇక ప్రథమ ఖండంలోని చతుర్థాధ్యాయం అంతా 'నికాయ' (బౌద్ధ సంప్రదాయాలు) సంబంధమైన వివరణతో నిండివున్నది. బుద్ధుని మరణానంతరం నూరు సంవత్సరాలకు బౌద్ధసంఘంలో భేదాభిప్రాయాలు తలలెత్తటంతో సంఘంలో చీలికలేర్పడ సాగినాయి. వీరందరిమధ్య ఒక పరిష్కార మార్గం ఏర్పరచటానికి తూర్పు పడమర భిక్షులు అంతా కలిసి ఒక సభచేసి బౌద్ధ మహా సంఘాన్ని కొన్ని నికాయాలుగా విభజించడం జరిగింది. ఈ నికాయాలు మొత్తం 18 అనీ, అవి ముఖ్యంగా నాలుగు ప్రధాన నికాయాలనుంచి విభజించబడినాయనీ ఆర్య మహాసాంఘిక, ఆర్య స్థవిర, ఆర్యమూలసర్వాస్తివాది, ఆర్యసమ్మతీయ అనేవి ఈ నాలుగు ప్రధాన నికాయాలు (సంప్రదాయాలు). ఒక్కొక్క నికాయం దేశంలోని ఒక్కొక్క ప్రాంతంలో వ్యాప్తి చెందింది. ప్రథమ ఖండంలోని ఆఖరిది అయిన పంచమాధ్యాయమంతా మానవుని అంతర్జగత్తుకు చెందిన సమాధిని గురించిన వివరణతో వుంది. లౌకిక సమాధి అని, లోకోత్తర సమాధి అనీ సమాధిని రెండుగా విభజించటం జరిగింది. ఈ అధ్యాయమంతాకూడా గహనమైన మనో విజ్ఞానానికి (Psychology) సంబంధించి వుంది. నిర్వాణాన్ని అందుకోటానికి బుద్ధుడు నైతిక రీతులనేకాక మనో వైజ్ఞానిక రీతులను కూడ అనేకం సూచించాడు. వీటిలో విపశ్యన, ధ్యానం, ప్రజ్ఞ, శుభతర్కం కర్మ, విద్య, ధర్మ, శీలం, ఉత్తమ ఆజీవిక, సమాధి అనేవి ప్రధానాలు. వీటిలో సమాధికి ప్రధానస్థానం ఇవ్వబడింది. వీటిలో విపశ్యన అనేదికూడా విశేష ప్రాధాన్యాన్ని కలిగి వుంది. ఈ విపశ్యన అనే జ్ఞానోదయం సాధకునిలో కలిగినప్పుడు ధర్మాలన్నీ అనిత్యాలుగా, దుఃఖమయాలుగా మారుతాయి. విపశ్యనను లోకోత్తర సమాధి అని అంటారు.

ఈ ప్రథమఖండంలోని పంచమాధ్యాయంలో గ్రంథకర్త ప్రదర్శించిన పాండిత్య, అభివ్యక్తి, అంతర్ దృష్టి, సమాలోచన, విషయ విశదీకరణ మొదలైనవి అపారమైనవి. ఒక వైపున పారిభాషిక పదాలను వాడుతూనే మళ్ళీ అవి సామాన్య పాఠకునకు అర్థమయేలాగా సరళ హిందీ పదాల్లో వివరిస్తూ చాలావరకు విషయంలోని జటిలతను ప్రాంజలపరిచారు గ్రంథకర్త. ఈ ప్రథమ ఖండంలోని మిగతా నాలుగు అధ్యాయాలను అర్థం చేసుకోవటం వేరు, ఈ అయిదవ అధ్యాయాన్ని అర్థం చేసుకోవటం వేరు. మిగతావి ఎక్కువభాగం బాహ్యస్థూల రేఖలు. ఈ అధ్యాయం అంతరిక సూక్ష్మరూపం.

ద్వితీయ ఖండంలోని అయిదు అధ్యాయాలుకూడ మహాయాన బౌద్ధానికి సంబంధించినవే. మహాయానం ఉత్పత్తి, దాని వికాసం, దాని దర్శనాలు, దాని సాహిత్యం మొదలైనవన్నీ ఈ ఖండంలో రచించబడినాయి. అశోకచక్రవర్తి బౌద్ధుడు

అయిన తరువాత బౌద్ధం దేశంలో చాలా వ్యాపించటం జరిగింది. దేశంలో మాత్రమే కాక దేశాంతరాలకుకూడా పయనించింది. అశోకుని సమయంనాటికి ఇంకా బౌద్ధు లలో విగ్రహారాధన తలయెత్తలేదు. ఆదివరలో స్తూపాల్లోవున్న బుద్ధుని అస్థులను బయటికితీసి 84000 నూతన స్తూపాలలో ప్రవేశపెట్టినట్లు చెపుతారు. బుద్ధుని కాలంలో బౌద్ధం నైతికధర్మ ప్రధానంగా ఎక్కువగావుండి ఎక్కువ వాస్తవికతను కలిగిఉండేది. బుద్ధుడు తనను ఒక మానవుడుగానే చెప్పుకొన్నాడు కాని లోకోత్తర పురుషుడుగా చెప్పుకోలేదు. కాని బుద్ధుని మరణానంతరం కొంతకాలానికి బుద్ధుని దైవంగా పూజించ ప్రారంభించారు. బుద్ధుడు ఏదైతే నిషేధించి పోయినాడో దానినే క్రమేణ ఆయన అనుయాయులు ఆచరించసాగేరు. హేతువాదాన్నీ కేవల నైతికమార్గాన్నీ బౌద్ధులు ఆచరించటంలో అరుచిని కనపరచి బౌద్ధంలో ఒక లోకోత్తర వాతావరణాన్ని సృష్టించుకొని అందులో ఆనందాన్ని అన్వేషించసాగేరు. అరూపసాధన రూపసాధనలోకి రూపాంతరం చెందసాగింది. గతించిన బుద్ధునికి దైవత్వం ఆపాదించి, ఆరాధించటంలో ఇష్టపడ ప్రారంభించారు. ఇటువంటి వారంతా కలసి తమ ఈ నూతన పంథాకు మహాయానం అనే పేరుపెట్టుకొని అదివరలో వ్యాప్తిలోవున్న మౌలిక బౌద్ధాన్ని హీనయానం అనే పేర పిలచి కించపరచసాగేరు. అప్పటినుంచే మహాయానం ఉద్భవించింది. గ్రీకులు కూడ ఈ మహాయానాన్ని స్వీకరించినప్పటి నుంచి వారు బుద్ధప్రతిమలను నిర్మించసాగేరు. ఆ నిర్మించిన ప్రతిమలను ఆరాధించసాగేరు.

## బోధిసత్వులు

మహాయానంలో బోధిసత్వులు ప్రత్యక్షం కాజొచ్చారు. హీనయాన బౌద్ధంలో నిర్వాణం చెందటం బౌద్ధుల ఆదర్శంగా వుండేది. మహాయానంలో వైయక్తిక నిర్వాణం చెందటం స్వార్థపరంగా భావించబడి బోధిసత్వులుగా లోకంలో వెలసి మానవసేవ చేయటం లోకోత్తర జీవితపు చరమ ఆదర్శంగా ఎంచబడ సాగింది. అవలోకితేశ్వర, మంజుశ్రీ, మైత్రేయ మొదలైనవారెందరో బోధిసత్వులు మహాయానంలో సృష్టించబడటం జరిగింది. హీనయానంలో వాస్తవికత తప్ప కల్పన లేదు; మహాయానంలో కల్పనతప్ప వాస్తవికత లేదు. అలౌకిక శక్తులనేకం సృష్టించబడినాయి. ఈ విధంగా మహాయానం అంతా ఒక గొప్ప లోకోత్తర సత్తాగా రూపొందింది. ఇందులో బుద్ధుని ఉపదేశాలకంటే బుద్ధుని నామరూపాలకు ఎక్కువ ప్రాధాన్యం లభించసాగింది. హీనయానంలోని అష్టాంగమార్గానికి బదులు మహాయానంలో బోధిసత్వచర్య బాగా పాతుకపోయింది. హీనయానంలోనిది ఆదర్శం అర్హత్వాన్ని సంపాదించటం; మహా

యానంలోనిది బోధిసత్వత్వాన్ని సంపాయించటం. హీనయానానికి మరొక పేరు శ్రావకయానం. మహాయానానికి బోధిసత్వయానం అనీ, అగ్రయానం అని కూడ పేర్లువున్నాయి.

ఆచార్య నరేంద్రదేవ్ ప్రదర్శించిన సూక్ష్మ వివరాలనుబట్టి చూస్తే ఈ విషయాల్లో ఆయన జరిపిన గవేషణ అతి గహనమైందని తెలుస్తుంది. ఎక్కడెక్కడ గుప్తమైవున్న భోగట్టా అంతా ఇందులో వ్యక్తమైంది. మహాయాన బౌద్ధగ్రంథాలన్నీ సంస్కృతంలో రచించబడినవే. హీనయాన బౌద్ధగ్రంథాలలో కూడ కొన్ని సంస్కృతంలో రచించబడినవి వున్నప్పటికి అవన్నీ ఎక్కువగా పాళీలో రచించబడినవే. హీనయానంలో అనేక శాఖలు ఏర్పడినట్లుగానే మహాయానంకు కూడ వివిధ శాఖలు ఏర్పడినాయి. తంత్రాల ప్రభావంవల్ల దీనిలో మంత్రయానం అనీ, వజ్రయానం అనీ, తంత్రయానం అనీ కూడ శాఖలు వెలిశాయి. ఇవిగాక ప్రజ్ఞాయానంనుంచి రెండు దార్శనిక చింతా విధానాలు రూపొందాయి. మొదటిది మధ్యమికవాదం, రెండవది విజ్ఞానవాదం. మధ్యమికవాది విశ్వాసం ప్రకారం వస్తువులన్నీ స్వభావశూన్యాలు; ఇక విజ్ఞానవాది విశ్వాసం ప్రకారం బాహ్య వస్తుసముదాయం అంతాకూడ మిధ్య అనీ, విజ్ఞానంమాత్రమే సత్యం అనీ, బోధిసత్వుడు అవసరం అయిన మానవులకు సహాయపడుతుంటాడనీ, మహాయానులకు ప్రాచీన నికాయలు అంగీకారాలే కాని హీనయానులకు మహాయాన గ్రంథాలు అంగీకారాలు కావు. మహాయానులు ఏమి చెపుతారంటే మహాయానం అనేది నవీనమైందేమీ కాదనీ, హీనయానపు ప్రామాణికతను రుజువు చేస్తున్నవనీ, మధ్యమకారికల వృత్తికారుడైన చంద్రకీర్తి కథనం ప్రకారం హీనయాన గ్రంథాలలోకూడ శూన్యతకు సంబంధించిన శిక్షణ దొరుకుతుందని.

## శూన్యత

బౌద్ధుల శూన్యతకు అర్థం ఏమీలేని ఖాళీప్రదేశం అని కాదు, కంటికి కన్పించని భాగం అని. కంటికి కనుపించనిదంతా ఏమీ లేనట్లు లెక్కకాదు. దూరాలు కంటికి కనుపించవు. అందుకని ఆ దూరాల్లో ఏమీలేవని అర్థమా ? మిల్లీమీటర్‌లో పదిలక్షలవంతు కంటికి కనుపించదు. అందుకని అది లేనట్లా. శూన్యతను రూపంలేందిగా తీసుకున్నారు. అంటే అరూపమైనదంతా శూన్యం క్రింద లెక్క. శూన్యం కానిదంతా రూపభేదంతో నింపివుంటుంది; శూన్యం అనేది ఏ రూపంతోను నిండివుండక అరూపంగా మాత్రమే వుంటుంది. శూన్యత అంటే అరూపంతోవున్న పూర్ణతయే!

తృతీయఖండంలో బౌద్ధదర్శనానికి (Bhudhist) సంబంధించిన సామాన్యసిద్ధాంతాల వివరణ వున్నది. ప్రతీత్యసముత్పాద, క్షణ భంగవాదం, అనీశ్వరవాదం, అనాత్మవాదం మొదలైన దర్శనాలు చర్చించబడినాయి. బౌద్ధుల కర్మవాదాన్ని గురించీ, నిర్వాణాన్ని గురించీకూడా తర్కపూర్ణమైన చర్చ వున్నది. చతుర్థ ఖండంలో బౌద్ధదర్శనంలోని నాలుగు ప్రస్థానాలకు సంబంధించిన ప్రత్యేక గ్రంథాలకు ఆధారం చేసుకొని చేసిన విషయ వివరణ, ఇతర దర్శనాలతో పోల్చిచూస్తూ చేసిన తులనాత్మక అనుశీలనా వున్నాయి. ఇవికాక వైభాషికనయ, సౌతాంత్రికనయ, అసంగుని విజ్ఞానవాదం, వసుబంధుని విజ్ఞానవాదం, శూన్యవాదం మొదలైనవాటి విస్తృత వర్ణన వున్నది. ఇక అంతిమ ఖండమైన పంచమఖండం అంతా బౌద్ధన్యాయానికి సంబంధించింది. ఇందులో ఆకాశవాదం, కాలవాదంగురించి లోతైన చర్చ సాగింది. న్యాయానికి (తర్కానికి) సంబంధించిన ప్రత్యక్ష, స్వార్థానుమాన, పదార్థానుమాన విషయాలను గురించిన విపులమైన చర్చవున్నది. గ్రంథాంతంలో ఈ విషయాలకు సంబంధించిన అనేక గ్రంథాల పేర్లు ఇవ్వబడినాయి.

ఈ గ్రంథంలో బౌద్ధానికి సంబంధించిన దర్శన శాస్త్రాలు, తర్క శాస్త్రాలు, శాస్త్ర గ్రంథాలు మొదలైనవన్నీ సునిశితంగా ఆలోచించబడినాయి, సమాలోచించబడినాయి. నాగార్జుని తర్కం, వసుబంధుని తర్కం, దిఙ్నాగుని తర్కం, ధర్మకీర్తి తర్కం మొదలైనవన్నీ ఇందులో క్షుణ్ణంగా విశ్లేషించబడినాయి. తర్కం, తత్వం ఈ రెంటి ధారలూ లోతుగా ప్రవహించినాయి. ఇందులో వీటిని చదవటం అందరకు సులభమేకాని అర్థం చేసుకోటం కొందరకు మాత్రమే సులభం. ఆ అందరకు కూడ సులభమైన సులభంకాదు, కఠినమైన సులభం. ఇది ఆకారంలో బృహత్ గ్రంథం, ఆలోచనలో బృహత్ గ్రంథం, విషయంలో బృహత్ గ్రంథం. దీన్ని చదవటానికే చాలా రోజులు పడుతుంది. చదివేదాన్ని అర్థంచేసుకోటానికి ఇంకా ఎక్కువ రోజులు పడుతుంది. దీని జ టి ల స్వ భా వా న్ని గ్రహించే నరేంద్రదేవ్ దీన్ని సాధ్యమైనంత సరళ శైలిలో వ్రాయ ప్రయత్నించారు హిందీలో. ఆయన హిందీ వాక్యాలు చాలా చిన్నచిన్నవిగా రచించాడు. ఇందులోని భాష అర్థంకావటం చాలా సులభం. అయితే, భాష అర్థం కావటం వేరు, ఆ భాష అభివ్యక్తపరచే విషయం అర్థంకావటం వేరు. చదవటం అలవాటుంటే భాష అర్థమవుతుంది. విషయంతో ప్రాథమిక పరిచయమైనా లేనిదే విషయం అర్థంకాదు. అంటే ఈ గ్రంథం ఇద్దరకు అవసరం లేదు; అసలు విషయంతో బొత్తిగా పరిచయంలేని పామర పాఠకునకు, విషయం అంతా సమగ్రంగా తెలిసిన పండిత పాఠకునకు. మొదటి పాఠకునకు దీన్ని చదివినా అర్థంకాదు; రెండవ పాఠకుడు దీన్ని

చదవనవసరమే లేదు; విషయంలో కొంత పరిచయం ఉండి దాన్ని గురించి ఇంకా ఎక్కువ తెలుసుకోవాలని అభిలషించే పాఠకునకు ఇది ఎక్కువ ఉపయోగ కరం.

## జీవిత విశేషాలు

బౌద్ధంలోని తత్వాలను, తర్కాలను మాత్రమేకాక బుద్ధుని జీవితాన్ని కూడ సంగ్రహంగా వివరించారు, ఈ గ్రంథంలో. సామాన్యంగా బుద్ధుడుగా రూపొందకముందున్న సిద్ధార్థుని జీవిత విశేషాలు మాత్రమే ఎక్కువమందికి తెలుసు. బుద్ధుని సాధనకు సంబంధించిన వివరాలతో ఆయన మహాసంబోధిని పొందిన తరువాతి జీవిత విశేషాలతో చాలామందికి పరిచయం వుండదు. బుద్ధ జీవితానికి సంబంధించిన కొన్ని అరుదైన విశేషాలను, బుద్ధుని సమకాలిక పురుషులను గురించి బౌద్ధసంఘపు నాటి పరిస్థితులను గురించి గ్రంథకర్త ఇందులో వివరంగా వర్ణించారు.

బుద్ధుడు జన్మించేనాటికి తాపసులకూ, వనవాసులకూ సంఘంలో ఎక్కువ విలువ ఏర్పడివున్నది. అరణ్యాల్లోవుండి తపస్సు చేస్తేనేకాని ముక్తి లభించదు అనే విశ్వాసం ఆనాటికి పాతుకుపోయివుంది. అరణ్యాల్లో వుండే ఇటువంటివారిని ఆరణ్యకులు అనేవారు అప్పుడు. బుద్ధుడు క్షత్రియజాతిలో జన్మించాడు. ఆ కాలంలో తూర్పు ప్రాంతాలలో క్షత్రియులకు చాలా గౌరవం ఉండేదట. జనక మహారాజు క్షత్రియుడైనప్పటికి గొప్ప వేత్తగా పేరొందేడు. బౌద్ధ, జైన మతాల స్థాపకులు క్షత్రియులే. "పాలినికాయ" అనే గ్రంథంలో వర్ణవ్యవస్థను గురించి వ్రాస్తూ క్షత్రియులను మొదటి కులంవారుగా పేర్కొన్నట్లు ఇందులో గ్రంథకర్త తెలుపుతారు. బుద్ధుడు జన్మించిన శాక్యవంశపు రాజ్యం అంత గొప్పది కాదు; అది చిన్న రాజ్యమే. ఆనాడు భారతదేశంలో అంతగా విశాలమైన రాజ్యాలులేవు. తరువాత నందవంశీయులు సంఘటితపరచిన పిమ్మట చంద్రగుప్తమౌర్యుడు ఆ రాజ్యాన్ని పెద్దదిచేసి వృద్ధిచేశాడు. జాతక కథల మూలంగా తెలుస్తుంది బుద్ధునికి పూర్వం పదహారు మహారాష్ట్రాలు వుండేవట. బుద్ధుని కాలంలో నాలుగు ప్రధాన రాజ్యాలు సంఘటితం అవుతున్నవి. ఈ నాలుగు ప్రధాన రాజ్యాలు: 1. మగధ; ఇందులో అంగదేశం కలిసివుండేది; దీని పాలకుడు బింబిసారుడు. 2. కోశల; దీని రాజధాని శ్రావస్తి, కాశీ కలిసివుండేది. దీని పాలకుడు ప్రసేనజిత్. 3. కౌశాంబి; దీని ఏలిక వత్సరాజ ఉదయనుడు. 4. అవంతి; దీని రాజు చండప్రద్యోతుడు. ఈ నాలుగు రాజ్యాల రాజధానులు కూడ కొంత కాలానికి బౌద్ధ కేంద్రాలుగా రూపొందేయి.

ఇటువంటి విశేషమైన చారిత్రిక వివరణలను ఈ గ్రంథంలో ఇచ్చి గ్రంథ

కర్త చాలా మేలు చేశారు పాఠకలోకానికి. ప్రాచీన భౌగోళిక, సాంఘిక విశేషాలు కూడా ఈ గ్రంథంలో లభిస్తాయి. 26 వందల ఏళ్ళనాటి భారతదేశపు భౌగోళిక, సాంఘిక, రాజనైతిక, సాంస్కృతిక పరిస్థితులకూ నేటి వాటికీ ఏమాత్రం పోలికలుండటానికి వీలుండదు. సాంస్కృతికంగా కొన్ని పోలికలుండవచ్చు.

సిద్ధార్థుడు అందరు రాజకుమారులవలె విద్యనార్జించాడు. సిద్ధార్థునికి తండ్రి శుద్ధోధనుడు వైదికమతావలంబి. సిద్ధార్థునికి బాల్యం నుంచీ ప్రాపంచిక సుఖాలమీద కొంత విరక్తి వుంటుండేది. జీవిత రహస్యాలను, మరణ రహస్యాలను తెలుసుకోవాలనే జిజ్ఞాస అదమ్యంగా వుండేది. ఆనాడు తాపసులకూ ఆరణ్యకులకూ విలువుండేది అని చెప్పుకొన్నాం. తన తండ్రిదగ్గరకు కాల-దేవల మొదలైన తాపసులు వస్తుండేవారు. సిద్ధార్థునికి పరమార్థసత్యం తెలుసుకోవాలనే ఆరాటం ఎక్కువైంది. ఒకనాడు ఇల్లువదలి బయటికి వెళ్ళిపోయి కాషాయ వస్త్రాలు ధరించి భిక్షువేషంలో సంచారం సాగించాడు. ఒక తపోవనంలో తెలుసుకొన్నాడు బింబప్రకోష్ఠంలో "అరాడ-కాలాం" అనే తాపసి నివసిస్తున్నాడనీ, ఆయనకు నిఃశ్రేయస్సుకు సంబంధించిన జ్ఞానం అనంతంగా వున్నదనీ. అప్పుడు సిద్ధార్థుడు అరాడ తపోవనంలోకి పోయి ఆ తాపసిని కలుసుకొని ఈ జరామరణ రోగం నుంచి జీవులు ఏ విధంగా విముక్తులవుతారని ప్రశ్నించాడు. అప్పుడు "అరాడ" తన శాస్త్రాన్ని సిద్ధార్థునకు విశదపరచాడు. జగత్తుయొక్క ఉత్పత్తినీ, దాని వివర్తననూ వివరించాడు. తత్వోపదేశంచేసి నైష్ఠిక పదప్రాప్తికి ఉపాయాలను కూడ సూచించాడు. కాని సిద్ధార్థునకు ఆ తాపసి ఉపదేశాలు సంతృప్తి నివ్వజాలకపోయినాయి. ఇంకా విశేషాలను తెలుసుకొనే నిమిత్తం సిద్ధార్థుడు "ఉద్రిక్-రామపుత్ర" నివసించే ఆశ్రమానికి చేరుకున్నాడు. కాని ఆయన తత్వంకూడా సిద్ధార్థునకు నచ్చలేదు. వీరి శిక్షణంతా సాంఖ్యయోగానికి సంబంధించింది. వీరందరి వల్ల సంతృప్తి లభించక సర్వశ్రేష్ఠమైన జ్ఞానోదయప్రాప్తి గవేషణలో "ఉరువేల" చేరుకొని నేరంజనా నదీతీరాన మకాంపెట్టేడు. తాను ఆలోచించాడు తనలో కూడా శ్రద్ధ వున్నది, వీర్యం ఉన్నది, స్మృతి ఉన్నది, ఏకాగ్రత ఉన్నది, ప్రజ్ఞ ఉన్నది కనుక తాను స్వయంగా జ్ఞానోదయాన్ని పొందగలడు అని.

## సమకాలికులు

ఆనాడు బుద్ధుని సమకాలికులు ఆరుగురు ప్రసిద్ధులున్నారు. అజితకేశ కంబిల్, పూరణకస్సప, పకుధకచ్చాయన్, మఖ్ఖరిగోసాల్, సంజయవేలర్టిపుత్త, నిగంఠనాతపుత్త అనేవారు. వీరిలో నిగంఠనాతపుత్త జైనమతంలోని అంతిమతీర్థంకరుడైన మహావీరుడు. వీరిలో ఉయన ఒక్కడే ఆస్తికుడు. అజితకేశకంబల్ మతంలో సుకృతిలేదు. దుష్కృతిలేదు, కర్మలేదు, ఇహంలేదు, పరంలేదు.

ఇందులోని మిగతా నలుగురి వాదాలుకూడా విడ్డూరమైన వాదాలు. వీరిలో గోసాల్ అనే ఆయన ఆజీవక సంప్రదాయ స్థాపకుడు. రకరకాలైన కష్టమైన తపస్సులన్ను చేస్తుంటాడు ఆయన. జేతవనంకు వెనక ఆయన నివాసం. ఈయన పంచాగ్నుల సెగలమధ్య నిలచి తపస్సు చేసేవాడు. ఆజీవకులంటే బుద్ధునికి అసలు సరిపడేది కాదు. తాపసులైనందున వీరికి సమాజంలో ఆదరణ లభించేది. ప్రజలు శకునాల, స్వప్నాల ఫలితాలను గురించీ, ఇంకా అలౌకిక విషయాలను గురించీ వీరిని అడిగి తెలుసుకొంటూవుండేవాళ్ళు. అశోకుడు, ఆయన పౌత్రుడు దశరధునికి సంబంధించిన రచనల్లో ఆజీవకుల విషయాలు గోచరిస్తాయి. ఆజీవకులుకాక ఆనాడు ఇంకా ఇతర సంప్రదాయపు తాపసులు అనేకమంది ఉండేవారు. వారంతాకూడా శరీరాన్ని వివిధ విధాలుగా కష్టపెడుతుండేవారు. కొందరు నారవస్త్రాలు ధరిస్తే మరి కొందరు కుశవస్త్రాలు ధరించేవారు: కొందరు కేశకంబళ్ళను ధరిస్తే మరికొందరు పక్షుల ఈకెలను ధరించేవారు; కొందరు ముళ్ళమీద శయనించి తపస్సుచేసేవారు. వాతావరణ వైపరీత్యాలను సహించే నిమిత్తం ఎండలో, వానలో, మంచులో తమతమ శరీరాలను బాధపెట్టేవారు. దుఃఖంద్వారా సుఖం ప్రాప్తిస్తుందని వారి విశ్వాసం. ఇటువంటి కష్టమైన జీవితాలను గడుపుతున్నారని సమాజంలో వారికి విలువవుండేది. వీరంతా ఏ ఉద్దేశ్యంతో తపస్సు చేస్తున్నారో తెలిసేదికాదు. కొన్ని అద్భుతశక్తుల ప్రాప్తినిమిత్తం తపస్సులు ఆచరిస్తున్నారేమో అనిపిస్తుంది. ఏవో కొన్ని మహిమలను ప్రదర్శిస్తుండేవారు **కూడ.**

ఇటువంటి పరిసరాల్లో, పరిస్థితుల్లో బుద్ధుడు కూడ "నేరంజన" నదీతీరాన వుండి ఆరు సంవత్సరాలపాటు ఇటువంటి బాధామయ తపస్సును ఆచరించాడు. బుద్ధునితో మరి అయిదుగురు భిక్షువులు కూడ వుండేవారు. జనన మరణాలమీద విజయం సాధించాలని వారి తపస్సు. వారు ఒక్క బియ్యపుగింజను తిని జీవించేవారు. దీని ఫలితం వారి శరీరాలు కృశించిపోయి ఎముకలూ చర్మమూ మిగిలిపోయాయి. అప్పుడు వారికి తెలిసింది, ఇటువంటి వైరాగ్య జీవితం ద్వారా ముక్తి లభించదని, దుర్బలులు ముక్తి అందుకోలేరని. ఇటువంటి ఆలోచనతో బుద్ధుడు తన అనశనవ్రతాన్ని వదలి తిరిగి ఆహారం తీసుకో ప్రారంభించాడు. ఆయన శరీరము మనస్సుకూడ ఆరోగ్యాన్ని పొందిన తరవాత ఆయన తిరిగి ఏకాగ్రసాధన సాగించాడు. ఆ అయిదుగురు సహచరులకూ బుద్ధుని నూతన పద్ధతి నచ్చక ఆయన్ను వదలి వెళ్ళటం జరిగింది. అంతటితో సిద్ధార్థుడు రావి చెట్టుక్రింద కూర్చొని బోధి లభించనిదే ఆ ఆసనాన్ని వదలను అని దృఢ నిశ్చయం చేసుకొన్నాడు. రాత్రి ప్రధమయామంలో ఆయనకు తన పూర్వ జన్మల జ్ఞానం కలిగిందట; రెండవయామంలో దివ్యచక్షువులు ప్రకాశించినవట; మూడవయామంలో

ద్వాదశ ప్రతీత్య-సముత్పాద సాక్షాత్కారం జరిగినదట; ఇక అరుణోదయ సమయంలో ఆయనకు సర్వజ్ఞత సాక్షాత్కరించినదట. ఆనాటి నుంచి సిద్ధార్థుడు బుద్ధుడు అయినాడు.

## జ్ఞానప్రాప్తి

సిద్ధార్థునకు ఆ రాత్రంతా సంభవిస్తున్న ఈ నాలుగుదశల జ్ఞానప్రాప్తి ఎంతవరకు సంభవమూ, సహేతుకమూ అని ఆచార్య నరేంద్రదేవ్ ఇందులో కొంత వైజ్ఞానిక చర్చచేసి అది ఎంతవరకు సంభవం, ఎంతవరకు అసంభవం, అది ఎంతవరకు సత్యం, ఎంతవరకు అసత్యం అని కొంత మనో వైజ్ఞానిక విశ్లేషణ (Psychological analysis) చేసి చూస్తే బాగుండేది. అది ఆయన చేయలేదు. తనకు దొరికిన, చారిత్ర కాధారాలను మాత్రమే ఆయన ప్రదర్శించారు. కాని వాటిని గురించిన తన స్వీయ అభిప్రాయాలను ఆయన వెల్లడించే శ్రమ అంతగా తీసుకోలేదు. వాస్తవాన్ని పెట్టి కల్పనను కొలవటానికి ఆయన ప్రయత్నించలేదు. ఈ గ్రంథంలో ఎంత విడ్డూరవిషయం, ఎంతటి అసంభావ్య విషయం వచ్చినా, దాన్ని వున్నది వున్నట్టుగా ఉల్లేఖించాడే కాని అటువంటి విడ్డూరాల సహజత్వాన్ని గురించికాని అసహజత్వాన్ని గురించికాని, అటువంటి విడ్డూరాలు తాను స్వయంగా నమ్ముతున్నాడా నమ్మటంలేదా అనేదాన్ని గురించికాని ఆయన ఏ మాత్రమూ అభిప్రాయ ప్రకటన చేయలేదు. బహుశా ఈ వస్తుగత వైఖరి(Objective attitude) చరిత్రకారులకు ముఖ్యమైవుంటుంది.

సిద్ధార్థునికి సంబోధిప్రాప్తి జరిగి బుద్ధుడు అయిన తరువాత ఏడు వారాల పాటు అక్కడక్కడ చెట్లక్రింద కాలాన్ని గడుపుతూ తన జీవితాన్నర్పించి పొందిన విముక్తి ఆనందాన్ని అనుభవించసాగేడు. ధర్మోపన్యాసాలు చేయటం మొదలైనవి మొదట్లో ఆయనకు ఇష్టంలేదు. కాని కొందరి అనురోధంవల్ల ఆయన ధర్మోపదేశాలు చేయటానికి ఇష్టపడటం జరిగింది. ఆయన తన ప్రథమ ధర్మోపదేశాన్ని తనను తపస్సుకాలంలో వదలివెళ్ళిన అయిదుగురు సహచరులకూ "ఋషిపత్తన్" మృగదావ (కాశీసమీపపు సారానాథ్)లో చేశాడు. ఆ ప్రథమోపన్యాసం ఆషాఢ పూర్ణిమ రోజున జరిగినదట. దానిపేరే "ధర్మచక్ర ప్రవర్తన సూత్ర" అయింది. ఆ అయిదుగురు సహచరులూ బుద్ధునికి మొదటి శిష్యులైనారు. క్రమేణా కొద్ది కాలంలోనే బుద్ధునికి అరవైమంది శిష్యులు ఏర్పడ్డారు. వీరందరితో ఒక బుద్ధసంఘం ఏర్పరచబడింది. సన్యసించిన శిష్యులను భిక్షువులనీ, గృహస్థ శిష్యులను ఉపాసకులనీ అంటారు.

బుద్ధుడు తన శిష్యబృందంలోకి స్త్రీలను చేర్చుకొనటానికి ప్రథమంలో

నిరాకరించాడు. కాని తన ప్రియశిష్యుడైన ఆనందుని సలహా ననుసరించి తన అభిప్రాయాన్ని మార్చుకొని మహా ప్రజాపతి గౌతమిని భిక్షుణిగా స్వీకరించాడు. తన కుమారుడైన రాహుల్‌ను కూడా భిక్షువుగా చేర్చుకొన్నాడు. ప్రథమంలో ఏర్పడ్డ అరవైమంది శిష్యులనూ అక్కడక్కడ ధర్మప్రచారానికి పంపి తాను స్వయంగా "ఉరువేల"లో ప్రవేశించాడు. క్రమేణ పేదలు మొదలు రాజుల వరకూ కులటలు మొదలు సాధ్వీమణులవరకూ బుద్ధుని శిష్యులు, శిష్యురాండ్రు కాజొచ్చారు. బుద్ధుని జీవితకాలంలోనే బౌద్ధం చాలావరకు వ్యాపించింది. ఇక ఆయన మరణానంతరం అది ఖండాల్లోనే కాక ఖండాతరాల్లో కూడా వ్యాప్తిచెందింది.

బుద్ధుని ఉపదేశాలు చాల్గా సరళంగాను, ఆచరణయోగ్యాలుగాను, నిత్య జీవితంలోని బాధలనుంచి విముక్తి పరచేవిగాను వుండేవి. జటిలమైన దార్శనిక తత్వాలను ఆయన ఉపదేశించేవాడుకాదు. మానవుడు దుఃఖాల్లో ఉంటున్నాడు. ఆ దుఃఖాలనుంచి బయట పడటమే మానవ జీవితాదర్శం అనే ఆయన ఉపదేశాలు ఎక్కువ ఆధారపడివుండేవి. అందుకే బౌద్ధం అంతగా ప్రజారంజకమైంది. కాని బుద్ధుని మరణానంతరం బౌద్ధంలో జటిలమైన వివిధ తత్వాలు, తర్కాలు అనంతంగా సృష్టించబడటం జరిగింది. బుద్ధుడు తన జీవితంలో ఉపదేశించిన తత్వాలు చాలా సరళమైనట్టివి. బుద్ధుడు మధ్యమ మార్గాన్ని ఎక్కువగా ఉపదేశించాడు. దేనిలోనుకూడ అతి అనేది పనికిరాదని మధ్యమ మార్గపు ఆదేశం. జీవితంలో అతి భోగంకాని, అతి త్యాగంకాని వాంఛనీయాలుకావని.

## దశశీలాలు

భిక్షువు ఆచరించవలసినవి దశశీలాలు. గృహస్తు ఆచరించవలసినవి పంచ శీలాలు. 1. ప్రాణాతిపాతవిరతి. 2. అదత్తదానం. 3. బ్రహ్మచర్య. 4. మృషావాద. 5. సురామద్యమైరేయ. 6. అకాల భోజనం. 7. నృత్యగీత వాదిత్ర. 8. మాల్యగంధ విలేపన. 9. ఉచ్చాశనశయనం. 10. జాతరూప జతప్రతిగ్రహ. ఈ పదిదశశీలాలు. ఇక పంచశీలాలు ఇవి: 1. ప్రాణాతి పాతవిరతి: 2. అదత్తదాన విరతి. 3. కామమిథ్యాచారవిరతి. 4. మృషావాదవిరతి. 5. సురామైరేయ ప్రమాద స్థానవిరతి. బౌద్ధంలో అష్టాంగిక మార్గానికి చాలాప్రాధాన్యంవున్నది. జీవితంలో భార సామ్యం (Balance) చాలా అవసరం. అటువంటి భారసామ్యం వుండాలంటే నిత్య జీవితంలోని ప్రతిపనీ వక్రంగా లేకుండా సక్రమంగా వుండటం అవసరం. అందుకే బౌద్ధంలో అష్టాంగిమార్గం ఏర్పాటయింది. 1. సమ్యక్ దృష్టి, 2. సమ్యక్ సంకల్ప, 3. సమ్యక్ వ్యాయామ, 4. సమ్యక్ స్మృతి, 5. సమ్యక్ వాక్, 6. సమ్యక్ కర్మాంత, 7. సమ్యక్ జీవం, 8. సమ్యక్ సమాధి.

ఆచార్య నరేంద్రదేవ్ రచించిన "బౌద్ధధర్మ దర్శన్" బౌద్ధ విషయంతో ఒక గొప్ప విజ్ఞాన సర్వస్వం. ఈ గ్రంథంలో లేని బౌద్ధ విషయం ఏ గ్రంథంలోను లేదు. బౌద్ధ గ్రంథాలన్నిటిలో వున్న విషయమంతా ఒకే గ్రంథంలో వున్నది. ఆయన అపారభాషా పాండితి, అనంతమైన విషయ పరిజ్ఞానం, బాహ్య అనుశీలన, దార్శనిక అంతర్దృష్టి, తార్కిక శక్తి, విశ్లేషణాత్మక వివరణ, సంశ్లేషణాత్మక సమన్వయం, నిష్పాక్షిక చారిత్రిక సత్యాన్వేషణ మొదలైన్నవి వాటికవే సాటి. ఈ గ్రంథానికీ, గ్రంథకర్తకూ ఎన్ని విశేషణాలను ఉపయోగించినప్పటికి అవి అతిశయోక్తులు కాజాలవు. "బౌద్ధధర్మదర్శన్" లోని ప్రతి పుట కూడ ఒక జ్ఞానకిరణం ! ప్రతివాక్యంకూడ ఒక సజీవ సత్యం !! ప్రతి వాక్కుకూడ ఒక సంబోధి !!!

---

"భారతదేశ చరిత్ర, సంప్రదాయాలకు సంబంధించిన వివాదాలన్నింటికి అతీతమైన ఒక మౌలిక సత్యాన్ని మనం ముందుగా గుర్తించవలసి ఉంటుంది. ఈ దేశానికి 4000 సంవత్సరాల సాంస్కృతిక చరిత్ర ఉంది. దీనిని చరిత్రకారు లెవ్వరూ కాదనలేరు. మొట్టమొదటి ప్రశ్న ఏమంటే ఈ 4000 సంవత్సరాల సుదీర్ఘ చరిత్రలో భారతదేశం ఒకే మతం కల్గిన దేశంగా ఉంటూ వచ్చిందా ? నిస్సంశయంగా కాదు."

శ్రీ ఎన్. ఇ. బలరామ్
"హిందూత్వ-దాని అసలురంగు" వ్యాసంలో
1993 ఆగస్టు కమ్యూనిజం నుండి

---

# మానవశాస్త్రి ఆవిర్భావం, క్రమాభివృద్ధి

డాక్టర్ మాడభూషి భావనాచార్య

ఆంత్రపాలజీ అంటే మానవశాస్త్రం. 17, 18 శతాబ్దాలలో అనేక మౌలిక శాస్త్రిలు మానవుడు అవిష్కరించాడు. వీటికి భూమిక 17వ శతాబ్దంలో జరిగిన పారి శ్రామిక విప్లవం. జేమ్స్‌వాట్ ఆవిరి యంత్రాన్ని కనుగొనడం, మైఖేల్ ఫారడే విద్యు దయస్కాంత. సిద్ధాంతాన్ని కూడా ప్రతిపాదించడం జరిగింది. 19వ శతాబ్దంలో చార్లెస్ డార్విన్ పరిణామ సిద్ధాంతాన్ని వెలువరించటంతో ఆంత్రపాలజీ, ఆర్కియా లజీ శాస్త్రిలు ఉద్భవించాయి. ప్రాథమిక దశలో 'మేజిక్' దానిని త్రోసిపుచ్చి మతము, దానిని కూడా త్రోసిపుచ్చి సైన్సు క్రమాభివృద్ధిని పొందాయి. మానవ మేధా వికాసము మూర్ఖవిశ్వాసాలనుండి హేతువాద దృష్టి, గతితార్కిక భౌతికవాదపంథాలో పయనిస్తూవుంది. ఆంత్రపాలజీ గురించి 'హెర్‌స్కోవిట్' అనే శాస్త్రవేత్త ఇలా అన్నాడు' **Anthropology studies man, present as also past and also sub-Human, pre human origins. It studies man on any part of the earth. Whether he is savage or civilized, It studies man at all levels of culture.** ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ ఈ విధముగా అర్థము చెప్పినది."The science of man or of mankind in the widest sense".

మానవ శాస్త్రిన్ని '5' ప్రధాన భాగాలుగా విభజించవచ్చు. అవి (1)సాంఘిక-సాంస్కృతిక మానవ శాస్త్రము (2) శారీరక మానవశాస్త్రము (3)పురాతత్వ మానవ శాస్త్రము (4) భాషామానవ శాస్త్రము (5) అనువర్తితమానవ శాస్త్రము. సాంఘిక-సాంస్కృతిక మానవ శాస్త్రము ప్రజలను వారి జీవనవిధానాలను అధ్యయనం చేస్తుంది. ఈ శాస్త్రములోనే ఉపవిభాగాలున్నాయి: అవి సాంఘిక మానవశాస్త్రము మరియు సాంస్కృతిక మానవశాస్త్రము ఇవి పరస్పర సంబంధం కలిగి ఉన్నాయి.

## సాంఘిక మానవ శాస్త్రిం

సాంఘిక మానవ శాస్త్రము ప్రజలు ఎలా సమూహాలుగా ఏర్పడతారు? ఎలా సంఘాలు ఏర్పరుచుకొంటారు? అన్న విషయాన్ని చర్చిస్తుంది. సాంస్కృతిక మానవ

శాస్త్రము ప్రజల ఆచార వ్యవహారాలను అధ్యయనం చేస్తుంది. సామాజిక మానవ శాస్త్రానికి సంఘం ఆసక్తికరమైన విషయం.

సంఘం అంటే ఒకే ప్రదేశంలో ఉంటూ, ఒకే జీవన విధానాన్ని అనుసరించే వ్యక్తుల సమూహము. సంస్కృతి అంటే నేర్చుకొన్న ప్రవర్తన, విజ్ఞానము, నమ్మకాలు, నీతి సూత్రాలు, విలువలు, కళలు, తరతరాలుగా వారసత్వంగా సంప్రదించే ఆచారాలు, సంప్రదాయాలు. సాంఘిక మానవశాస్త్రము వ్యక్తులు ఎలా గుంపులు, జట్టులు, తెగలుగా, సంఘాలుగా ఏర్పడుతున్నారు? వాటి నిర్మాణము, వ్యవస్థ, విధులు ఏమిటి? అవి ఆదిమ సమాజాలనుంచి గ్రామీణ సమాజాలుగా, వాటినుంచి పట్టణ సమాజాలుగా, మరల వాటినుంచి ఆధునాతన నాగరికతా సమాజాలుగా ఎలా వృద్ధి చెందాయని పరిశీలిస్తుంది. సమాజంలో వర్గీకరణ (Stratification) ఉన్నదా అన్న విషయాన్ని అధ్యయనం చేస్తుంది. 'వర్గీకరణ' అనేది సమాజంలో వ్యక్తుల హోదాలు వారు నిర్వహించే విధులు తెలియజేస్తుంది. సమాజానికి ప్రాథమికమైనది కుటుంబం. సామాజిక మానవ శాస్త్రజ్ఞులు కుటుంబాన్ని సమాజానికి మూలంగా పరిగణిస్తారు. కుటుంబంయొక్క విశ్వజననీయతను నిర్మాణము, వ్యవస్థ, అది నిర్వర్తించే విధుల దృష్ట్యా పరిశీలిస్తారు. కొన్ని రకాలైన కుటుంబాలు (కేంద్రక, సమిష్టి, ఉమ్మడి) కొన్ని సమాజాలలో ఎందుకు ఉన్నాయి? మరికొన్ని సమాజాలలో ఎందుకు లేవు? అన్న విషయాన్ని పరిశీలిస్తారు. స్థల, కాలాదులదృష్ట్యా కుటుంబం ఎలా మారుతుంది? కుటుంబం ఏర్పడటంలో మానవ సంబంధాలు, పుట్టుక, వివాహ విషయాల పాత్ర- బంధుత్వం ఏర్పడటంలో అనువంశికత్వం, వివాహ విషయాల పాత్ర-అనువంశికత్వం ఆధారంగా ప్రతిసమాజం వ్యవస్థీకరణ చెందుతుంది. మొదట కుటుంబంతో మొదలై తరువాత అనువంశికసమూహాలుగా, వంశాలుగా, గోత్రాలుగా, ద్విశాఖలుగా, గోత్రకూటములుగా అభివృద్ధిచెందుతుంది. ఈ విషయాలనన్నిటినీ సామాజిక, సాంస్కృతిక మానవశాస్త్రము అధ్యయనం చేస్తుంది.

## వివాహ వ్యవస్థ పరిణామాలు

వివాహవ్యవస్థ అన్ని సమాజాలలో ఒకే విధంగా ఉండదు. వివాహవ్యవస్థకు విశ్వజననీయమైన నిర్వచనం ఇవ్వటం సాధ్యపడదు. అది నిర్వహించే విధులు, బాధ్యతలు ఒక సమాజంనుంచి మరియొక సమాజానికి మారుతుంటాయి. వివిధ సమాజాలలో వివాహసంబంధాలు ఎలా ఏర్పడుతున్నాయి? సమాజంలో బంధుత్వం దృష్ట్యా వేరు వేరు బంధుత్వపదాలు ఎలా ఉపయోగించబడుతున్నాయి? బంధువుల మధ్య ఉన్న ప్రవర్తన, వారి హక్కులు, బాధ్యతలు ఎలా ఉన్నాయి? ఈ విషయాలన్నీ సంస్కృతిచే నిర్ధారించబడతాయి. ఈ విధముగా సాంఘిక-సాంస్కృతిక మానవ

శాస్త్రజ్ఞుడు ఒక వ్యక్తి పుట్టుక దగ్గరనుంచి, చనిపోయేవరకు అతనికి సంబంధించిన సాంఘిక, సాంస్కృతిక విషయాలను అధ్యయనం చేస్తాడు. మానవజీవితం అనేక విషయాలతో ముడిపడి ఉంటుంది. ప్రతీవిషయాన్ని మానవశాస్త్రము అధ్యయనం చేస్తుంది కాబట్టి అనేక ఉపవిభాగాలు ఏర్పడ్డాయి. అందులో ప్రముఖమైనవి (ఎ)ఆర్థిక మానవశాస్త్రము: ఆదిమ, వ్యవసాయక సమాజాలలో ఆర్థిక వ్యవహారాలు ఎలానడిచేవి? వస్తూత్పత్తి ఎలా జరుగుతుంది? మార్కెట్ వ్యవస్థ ఎలా వుంది? అన్న అంశాలపై ఆర్థికమానవ శాస్త్రం తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. ఆర్థిక వ్యవహారాలను సామాజిక, సాంస్కృతిక విషయాలతో మేళవించి అధ్యయనం చేస్తారు. దీనికి సంబంధించి రెండు దృక్పథాలున్నాయి. (1) ఫార్మలిస్ట్: ఈ దృక్పథం ఆర్థికశాస్త్ర నియమాలే ఆదిమ సమాజాల ఆర్థిక వ్యవహారాలను అధ్యనయం చేయటానికి సరిపోతాయని భావిస్తుంది. (2) సబ్‌స్టాన్టివిస్ట్; ఆర్థికశాస్త్ర నియమాలు ఆదిమ సమాజాల ఆర్థిక వ్యవహారాలను అధ్యయనం చేయటానికి సరిపోవు అని భావిస్తుంది. ఆదిమసమాజాల ఆర్థిక వ్యవహారాలను సామాజిక, సాంస్కృతిక నేపథ్యంలో అధ్యయనం చేయాలని ఈ దృక్పథం భావిస్తుంది. (b) రాజకీయ మానవశాస్త్రం: ఆదిమ సమాజాలలో రాజకీయ వ్యవహారాలు ఎలా ఉండేవి? ఆదిమసమాజాలలో న్యాయశాస్త్రం - న్యాయం - అనుజ్ఞలు. రాజకీయ వ్యవస్థ సామ్యవాద-వర్గీకృత వ్యవస్థలలో ఎలా ఉన్నది? నాయకత్వం అధికారం ఎలా సంక్రమిస్తుంది. వివిధ సమాజాలలో రాజకీయ వ్యవస్థలు ఎలా ఉన్నాయి? సంక్లిష్టసమాజాలలో-అప్పుడే అవతరిస్తున్న రాజ్యాలలో రాజకీయ వ్యవస్థలు, రాజ్యావతరణలో రాజకీయాలపాత్ర వీటన్నిటినీ రాజకీయ మానవశాస్త్రము అధ్యయనం చేస్తుంది. (c) మనోవైజ్ఞానిక మానవశాస్త్రము: మానవుని యొక్క మూర్తిమత్వాన్ని సంస్కృతిదృష్ట్యా నిర్వచిస్తారు. సాంస్కృతిక నేపథ్యంలో మనిషి యొక్క వ్యక్తిత్వం ఎలా రూపుదిద్దుకొంటుంది. సాంఘికీకరణం, సాంస్కృతికీకరణం అనే భావనలు ఈ విషయాన్ని అధ్యయనం చేయటంలో ఉపయోగపడతాయి.

## వ్యక్తిత్వం - సాంస్కృతిక కారణాలు

వివిధ సమాజాలలో పిల్లల్ని ఎలా పెంచుతున్నారు. అది వారి మూర్తిమత్వం రూపుదిద్దుకోవటంలో ఎలా తోడ్పడుతుంది అన్న విషయం దృష్ట్యా మానవ శాస్త్రజ్ఞులు 'బేసిక్ పర్సనాలిటీ స్ట్రక్చర్' అనే భావనను వృద్ధి చేశారు. దీనివలన మనిషి వ్యక్తిత్వంలో ఉండే సాంస్కృతిక కారకాలను తెలుసుకోవచ్చు. సంస్కృతి వ్యక్తిత్వాలను ప్రతిబింబిస్తే, వ్యక్తిత్వాలు సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. మానవ శాస్త్రజ్ఞులు సాంస్కృతిక వ్యవస్థలను ప్రాథమిక మరియు గౌణ వ్యవస్థలుగా విభజిస్తారు. ప్రాథమిక వ్యవస్థలు అంటే కుటుంబం, పరిసరాలు, ఆర్థిక

వ్యవస్థ, రాజకీయ వ్యవస్థ మరియు సాంఘికీకరణం. గౌణ వ్యవస్థలంటే పురాణాలు, జానపదగాథలు, మతం, ఇంద్రజాలం, కళలు. ప్రాథమిక వ్యవస్థలు మనిషి యొక్క మూర్తిమత్వాన్ని ప్రభావితం చేయగా, మనిషి యొక్క మూర్తిమత్వం గౌణ వ్యవస్థలను నిర్మించటానికి దోహదకారి అవుతుంది. (d) మత మానవ శాస్త్రము: మానవ శాస్త్రజ్ఞులు మతం ఎలా ఆవిర్భవించింది అన్న విషయానికి సంబంధించి చాలా సిద్ధాంతాలు రూపొందించారు. సర్వాత్మవాదం, జీవాత్మవాదం, మనాయిజమ్ (Manaism), ఆదిమ ఏక దేవతారాధన మొదలైనవి మత ఆవిర్భవానికి సంబంధించిన సిద్ధాంతాలే. ప్రకృతిశక్తుల, మానవాతీత శక్తులపట్ల మానవుల నమ్మకాలు, ఆదిమ సమాజాలలో మతవ్యవహారాలు, కర్మకాండ, మతసంస్కారాలు ఎలా ఉన్నాయి. సమాజంలో ఉండే మతసంబంధ నిషేధాలు, టోటెమిజమ్, ఇంద్రజాలం-మతం- విజ్ఞానశాస్త్రం వాటి మధ్య భేదాలు, మత సంబంధితసంస్కారాలు నిర్వహించే పురోహితులు, షామన్‌లు (Shamans), మెడిసిన్‌మేన్లు, తాంత్రిక విద్యలు, ఇంద్రజాలం, మతం నిర్వహించే మానసిక మరియు సాంఘిక విధులు. వీటన్నిటిని గూర్చి మతమానవ శాస్త్రము తెలియచేస్తుంది. (2) శారీరక మానవ శాస్త్రము: శారీరకమానవశాస్త్రము మానవుని ఒక జీవిగా (organism) పరిగణించి అధ్యయనంచేస్తుంది. మానవుడు ఎప్పుడూ ఒకేలాగా లేడు. అనేక వేలసంవత్సరాలుగా పరిణామంచెంది ప్రస్తుత రూపాన్ని సంతరించుకొన్నాడు. శారీరక మానవశాస్త్రంలో మూడు అంశాలు ఇమిడి ఉన్నాయి. అవి మానవ జీవశాస్త్రం, మానవ పరిణామం మరియు వైవిధ్యం. వీటి అధ్యయనం వల్ల మానవ జీవ, భౌతిక ధర్మాలను గురించి అవగాహన ఏర్పడుతుంది. శారీరక మానవశాస్త్రపరంగా మానవుని అధ్యయనం చేయటంలో మనము చేయవలసిన మొదటి పని జంతురాజ్యంలో అతని స్థానాన్ని తెలుసుకోవడం. ప్రైమేట్ల గురించి ప్రత్యేక అధ్యయనం. మానవ పరిణామంలో ఆసక్తికరమైనది 'మిస్సింగ్ లింక్'. నరవానరాలనుంచి మానవుని పోలిన జీవులు ఎప్పుడు విడిపోయారన్నది తెలియజేసేదే 'మిస్సింగ్ లింక్'.

## జీవ పరిణామ సిద్ధాంతాలు - అధ్యయన ప్రాధాన్యత

జీవ పరిణామం గురించి జీవశాస్త్రజ్ఞులు రూపొందించిన సిద్ధాంతాలు-లామార్కిజం-డార్వినిజం-సంయోజక సిద్ధాంతము మానవపరిణామం గురించి అర్థం చేసుకోడానికి ఉపయోగపడతాయి. అనువంశికత్వం, జన్యుశాస్త్రపరిజ్ఞానం జీవులు, వాటి సంతానం మధ్య పోలికలు, జీవులలో వైరుధ్యాన్ని విశదీకరించడానికి బాగా ఉపయోగపడతాయి. మానవునియొక్క సంస్కృతి మానవుడు పరిసరాలకు అనుగుణంగా సర్దుబాటుచేసుకోటానికి బ్రతకటానికి శక్తినిస్తుంది. ఇది కేవలం

బాహ్యంగానే కాకుండా అంతర్నిహితంగా కూడా ఉంటుంది. కొన్ని మానవ సమూహాలు తాము అనుసరించే సంస్కృతి వల్ల కొన్ని రోగాలకు రోగనిరోధక శక్తి సంపాదించుకున్నాయి. మానవులు ముఖ్యంగా ప్రజననం (In breeding), పరిసరాలకు సర్దుకుపోయే కారణంగా వైవిధ్యాన్ని కలిగి ఉన్నారు. ఈ వైవిధ్యం కారణంగానే మానవులను వివిధ జాతులుగా పరిగణిస్తున్నారు. మానవ జాతులను అధ్యయనం చేయటం ద్వారా శారీరక మానవశాస్త్రం జాతితత్వం మొదలైన అహంకార భావనలు తొలగిపోవడానికి కృషి చేసింది. శారీరక మానవశాస్త్రం మానవుని జీవధర్మం అతని సంస్కృతిని ఎంత వరకు ప్రభావితం చేస్తుంది? అతని సంస్కృతిని అతని జీవధర్మాన్ని ఎంత వరకు ప్రభావితం చేస్తుంది? అనే విషయం మీద కూడా తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. (3) పురాతత్వ మానవ శాస్త్రం: పూర్వ కాలంలో మానవుని సంస్కృతి ఎలా ఉద్భవించింది, వృద్ధి చెందింది అన్న విషయం మీద తన దృష్టిని ప్రసరిస్తుంది. చరిత్ర అంటే 5000 సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనల గురించి తెలుపుతుంది. దానికి సంబంధించిన వ్రాత ప్రతులు మొదలగునవి లభ్యమవుతాయి. పురాతత్వ శాస్త్రజ్ఞుడు కొన్ని వేల సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనల గురించి పరిశీలిస్తాడు. అతనికి వ్రాతప్రతులు అలాంటివి లభ్యంకావు. అతడు ఆ కాలానికి సంబంధించిన పనిముట్లు, మానవఅవశేషాలు పరిశీలించి ఆ సంస్కృతులు ఎలాఉండేవో ఊహిస్తాడు.

ఇక్కడ పురాతత్వ మానవ శాస్త్రజ్ఞునికి, సామాజిక మానవ శాస్త్రజ్ఞునికి భేదం ఉంది. పు.మా.శా చారిత్రక పూర్వపు సంస్కృతులను అధ్యయనం చేస్తాడు. సా.మా.శా. ప్రస్తుతం ఉన్న సంస్కృతులను అధ్యయనం చేస్తాడు. సా.మా.శా.నికి తను అధ్యయనం చేస్తున్న సంస్కృతులతో ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. పు.మా.శా.నికి ప్రత్యక్ష సంబంధం ఉండదు. పు.మా.శా. నికి ఒక ముఖ్య సమస్య ఉంది. చరిత్ర పూర్వ సంస్కృతులను వారు వదిలి వెళ్ళిన పనిముట్లను బట్టి అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ పనిముట్లు కూడా పూర్తిగా లభ్యం కావు. కాలానుగుణంగా కొంత నాశనం అయి ఉంటాయి. చారిత్రక పూర్వపు సంస్కృతులను ఆవిష్కరించటం పూర్తిగా సాధ్యం కాదు. వారికి లభ్యమైన పనిముట్లు ఆధారంగా కొన్ని ఊహలు చేస్తారు. దీనికి 'కార్బన్ డేటింగ్' పద్ధతిని ఉపయోగిస్తారు. పనిముట్లను పరిశీలించటం వల్లన వారి సంస్కృతి, సాంఘిక పరిస్థితులు, సాంకేతిక పరిజ్ఞానం, కళలు, మతపరమైన విషయాలను తెలుసుకోవచ్చు. వారి నివాస స్థలాలను పరిశీలించి ఒక నివాస స్థలములోనే రెండు రకాలైన ఇళ్ళు ఉంటే వర్గీకృత సమాజం ఉండేదని ఊహించవచ్చు. సమాధులను పరిశీలించటం ద్వారా మతపరమైన విషయాలు తెలుస్తాయి. పురాతత్వ మానవ

శాస్త్రం చారిత్రక పూర్వ యుగంలో భూమి వాతావరణంలో వచ్చిన మార్పులు, ముఖ్యంగా హిమయుగం, ఆ తర్వాత వచ్చిన మార్పులు, అవి నదీలోయలలో వదలి వెళ్ళిన 'స్ట్రాటిగ్రాఫీ' సాక్ష్యాలు, అచ్చట లభించే పనిముట్లను బట్టి ఆయా సంస్కృతులను అధ్యయనం చేస్తారు. ఆ పరికరాలను బట్టి మానవ సాంస్కృతిక అభివృద్ధిని మూడు భాగాలుగా విభజించారు. (1) ప్రాచీన శిలాయుగం (2) మధ్య శిలాయుగం (3) నవీన శిలాయుగం. ఈ మూడు యుగాలలో వాడిన పనిముట్లు కాలక్రమేణా వాటిలో వచ్చిన మార్పులు మానవుని సంస్కృతిలో, సాంకేతిక పరిజ్ఞానంలో వచ్చిన మార్పులను తెలుపుతాయి. నవీన శిలాయుగ విప్లవం, పట్టణీకరణం లాంటి ఇతర విషయాలు కూడా పురాతత్వ మానవశాస్త్ర సహాయంతో అధ్యయనం చేయవచ్చు. (4) భాషా మానవ శాస్త్రము: మానవునికి సంబంధించిన విషయాలలో అన్నిటి కంటె ముఖ్యమైనది అతడు తోటివారితో మాట్లాడ గలగటం. అదేభాష. మానవుని భాషలగురించి అధ్యయనంచేసే సామాజిక, సాంస్కృతిక మానవ శాస్త్ర ఉప విభాగాన్నే భాషామానవశాస్త్రము అంటారు. భాష ద్వారానే మానవుడు సంస్కృతిని పరిరక్షించి తరువాత తరాల వారికి అందజేస్తాడు. అందు వలన భాషా మానవ శాస్త్రజ్ఞులు పూర్వ కాలపు, ప్రస్తుత కాలపు భాషలను కూడా అధ్యయనం చేస్తాడు. భాష, సాంస్కృతిక ప్రవర్తన, సంస్కృతిని భాష ద్వారా వ్యక్తం చేయటం అన్నీ భాషా మానవ శాస్త్రానికి ఆసక్తికరమైన విషయాలు.

భాషా శాస్త్రానికి, భాషా మానవ శాస్త్రానికి మధ్య భేదం ఉంది. భాషా శాస్త్రం భాషల నిర్మాణాన్ని ముఖ్యంగా వ్రాయబడే భాషల నిర్మాణాన్ని పరిశీలిస్తుంది. భాషా మానవశాస్త్రం వ్రాయబడే భాషలే కాకుండా, వ్రాతలేని భాషలను కూడా అధ్యయనం చేస్తుంది. ఆచారాలు, నమ్మకాలు, సాంప్రదాయాలు కొన్ని భావనలు మనుషులలో కలుగజేస్తాయి. వాటికి సంస్కృతితో సంబంధం ఉండి సాంస్కృతికంగా నిర్ధారించబడతాయి. భాషకు అనేక పార్శ్వాలు ఉన్నాయి. (Language has many dimensions). మొదట భాషా నిర్మాణాన్ని పరిశీలిస్తారు. దీనినే భాషా నిర్మాణ శాస్త్రం అంటారు. భాష ఎలా ఉద్భవించింది, వృద్ధి చెందింది అనే విషయాన్ని చర్చించేదే చారిత్రక భాషాశాస్త్రం. తులనాత్మక భాషాశాస్త్రం ద్వారా వివిధ దేశాల ప్రజల భాషలను అధ్యయనం చేస్తారు. ఒక సామాజిక సందర్భంలో భాషను ఎలా ఉపయోగిస్తున్నారు, విషయ పరిజ్ఞానాన్ని ఎలా గ్రహిస్తున్నారు అన్న విషయాన్ని తెలియజేసేదే సామాజిక భాషాశాస్త్రము. సంస్కృతి భాషా నిర్మాణం మీద ప్రభావాన్ని చూపుతుంది. దీనిననుసరించి సాంస్కృతిక భేదాల మూలంగా భాషా భేదాలు వస్తాయి. కొన్ని భాషాపరమైన అంశాలు కొన్ని సాంస్కృతిక అంశాలను ప్రభావితం చేస్తాయి. భాషామానవశాస్త్రం జనాభాల వలస, దండయాత్రల

వలన భాషలలో వచ్చిన మార్పులను విశదీకరిస్తుంది. వర్ణనాత్మక భాషామానవ శాస్త్రం సైద్ధాంతిక భాషాశాస్త్రానికి, క్షేత్ర భాషాశాస్త్రానికి మధ్యగల భేదాలను తెలుపుతుంది.

# సైద్ధాంతిక భాషాశాస్త్రం

సైద్ధాంతిక భాషాశాస్త్రం ఒక భాష ఎలా పనిచేస్తుంది అన్న విషయాన్ని, వాక్య నిర్మాణాన్ని పరిశీలిస్తుంది. క్షేత్ర భాషాశాస్త్రం భాష నిజజీవితంలో ఎలా ఉపయోగించబడుతుంది అనే విషయాన్ని విశదీకరిస్తుంది. కొన్ని పదాలు, సమాసాలు ఒక్కొక్క భాషలో ఒక్కొక్క రకంగా ఉండి ఆ భాషకు ప్రత్యేకతను కలిగిస్తాయి. కొన్ని భాషలలో కొన్ని విషయాలకు వాటిని వ్యక్తీకరించే భాషా పదాలు ఉండవు. ఆ విషయాలకి ఏమీ సాంస్కృతిక ప్రాముఖ్యతలేదని అర్థమవుతుంది. సామాజిక భాషామానవశాస్త్రం బంధుత్వ పదాలను పరిశీలిస్తుంది. ఇవి ఆ సమాజంలో ఉండే కుటుంబ విషయాలు, వివాహ సంబంధాలు, అనువంశికత్వ నియమాలను తెలుపుతుంది. కొన్ని సమాజాలలో కొన్ని పదాలను అగౌరవ' నిషేధ పదాలుగా భావిస్తారు. ఇవి సమాజంలో కొనసాగే నీతి సూత్రాలను, మర్యాద పూర్వకమైన ప్రవర్తనను, సామాజిక సంబంధాలు, క్రియాశీల ప్రవర్తన, ప్రతికూల క్రియాశీల ప్రవర్తనను తెలుపుతుంది. కొన్ని సమాజాలలో మామూలుగా ఉండే భాషలే కాకుండా స్థానికంగా ఉండే మాండలికాలు ఉంటాయి. ఇలా మాండలికాలు ఉండటానికి సాంస్కృతిక కారకాలు ఏమిటి అన్న విషయాల్ని భాషా మానవశాస్త్రం పరిశీలిస్తుంది. (5) అనువర్తిత మానవశాస్త్రం: మానవశాస్త్రం యొక్క ప్రయోజనం మానవుని, అతని సమాజాన్ని, సంస్కృతిని అధ్యయనం చేయడమే కాకుండా, దానికి సంబంధించిన విషయ పరిజ్ఞానాన్ని మానవజీవితంలో ఎదుర్కొనే దైనందిన సమస్యల పరిష్కారానికి వినియోగించడమే. ఈ విషయంలో మానవ శాస్త్రజ్ఞుడు ప్రభుత్వానికి సలహాదారుడిగా పనిచేస్తాడు. అనువర్తిత మానవ శాస్త్ర ప్రయోజనం సలహా ఇవ్వడమే కాకుండా, ఏదైనా అభివృద్ధి పథకం అమలులో భాగస్వామ్యం తీసుకోవడం. మానవ శాస్త్రజ్ఞుడు వ్యక్తులను, వారి సంస్కృతులను అధ్యయనం చేస్తాడు. వారు ఎదుర్కొనే సమస్యలను పరిశీలిస్తాడు. ఈ సమస్యలకు పరిష్కారాలను సూచించటంలో అభివృద్ధి పథకం మంచి, చెడులను దృష్టిలో పెట్టుకుంటాడు. ప్రజలను అభివృద్ధి పరచటానికి ఒక పథకం తయారు చేయటమే ముఖ్యంకాదు. దానికి ప్రజల స్పందన ఎలా ఉంటుంది అనేది ముఖ్య విషయం.

ఒక సంస్కృతిలోకి ఒకకొత్త విషయాన్ని ప్రవేశపెట్టటంద్వారా వచ్చే మార్పులను పరిశీలించాలి. అభివృద్ధి పథకం అమలులోకి వచ్చిన తరువాత దానిని పర్య

వేషించడం, తదనుగుణంగా కలిగే సాంస్కృతిక మార్పులు పరిశీలించటం, ఏమైనా మార్పులు అవసరమైతే అభివృద్ధి పథకంలో మార్పులు చేయటం, ఒక అభివృద్ధి పథకాన్ని ఒక సాంస్కృతిక నేపథ్యంలో అమలు చేయటంవల్ల అది ఆ సంస్కృతికి సరిపడకపోతే ప్రజలు దానిని తిరస్కరించవచ్చు. ప్రజలకు ఇష్టం లేని మార్పులను మనము తీసుకొనిరాలేము. అందువలననే మానవ శాస్త్రజ్ఞులు ఇతర సంస్కృతులపట్ల గౌరవం, సదవగాహన కలిగి ఉంటారు. ఒక సంస్కృతి లోకి నూతన అంశాన్ని ప్రవేశపెట్టినప్పుడు దాని అంశాల్లో ఏదైనా మారితే మిగతా అంశాల్లో కూడా మార్పు వస్తుంది. దీనినే 'చైన్ రియాక్షన్' అంటారు. ఒక అభి వృద్ధి పథకాన్ని విజయవంతం చేసే ప్రయత్నంలో పరిపాలకులు ఈ విషయాన్ని పరిగణనలోకి తీసుకోరు. ఈ సందర్భంలో మానవ శాస్త్రజ్ఞుడు ఒక సంస్కృతిలోకి ఒక నూతన విషయాన్ని ప్రవేశపెట్టడంవల్ల వచ్చే మార్పులను ముందే ఊహించి పరిపాలకులకు తగిన సలహాలు అందించి అభివృద్ధి పథకాన్ని, సంస్కృతిని దృష్టిలో పెట్టుకొని రూపొందించేటట్లు చూస్తాడు. మానవ శాస్త్రజ్ఞుడు ఈ విషయంలో సాంస్కృతిక విశదీకరణకర్తగా, రెండు సంస్కృతుల మధ్య అనుసంధానకర్తగా వ్యవహరిస్తాడు.

## జన్యుశాస్త్రం అభివృద్ధి

జన్యుశాస్త్రం ఇటీవల బాగా అభివృద్ధి చెందింది. జన్యుశాస్త్ర పరిజ్ఞానాన్ని ఉపయోగించి మానవుల జన్యు చిత్రపటాలను తయారు చేస్తున్నారు. వీటినుపయో గించి మానవులలో వంశపారంపర్యంగా కొనసాగే జన్యుగత వ్యాధులను నివారించ వచ్చు. పారిశ్రామిక మనోవిజ్ఞానాన్ని ఉపయోగించి పారిశ్రామిక సంస్థలలో జరిగే సమ్మెలను నివారించి పారిశ్రామిక ఉత్పత్తి పెరిగేలా చూసుకోవచ్చు. పైనుదహరిం చినవన్నీ అనువర్తిత మానవశాస్త్రంలో భాగాలే. అంతేకాకుండా మానవశాస్త్రంలో అనేక విభాగాలున్నాయి. ఈ విభాగాల క్రింద క్రోడీకరించిన విషయ పరిజ్ఞానాన్ని ఆయా రంగాలలో మానవుడు ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి వినియోగించ వచ్చు. మానవశాస్త్ర పరమావధి మానవుని కేంద్ర బిందువుగా తీసుకొని, మానవు నికి సంబంధించిన అన్ని విషయాలను స్పృశిస్తూ మానవ జీవితం పట్ల సమగ్ర అవ గాహన కలిగించడమే! పెట్టుబడిదారీ విధానంలో సుఖజీవనంకోసం శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం పెరిగింది. ఆ విజ్ఞానాన్ని మానవ వికాసానికి కాక వినాశనానికి ఉపయోగిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానం వృద్ధి పొందిన ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీలలో కార్మికవర్గ విప్లవాలు వస్తాయని కార్ల్‌మార్క్స్ ఊహించాడు. 1872లో ఫ్రాన్స్‌లో విప్లవం వచ్చింది. అందులో కార్ల్‌మార్క్స్ పాల్గొన్నాడు. అది విఫలం

అయ్యింది. అందుకు కారణం కార్మిక, కర్షక నియంతృత్వం ఏర్పరచకపోవడమేనని కార్ల్‌మార్క్స్ గ్రహించాడు. ఈ విషయం 'కమ్యూనిస్ట్ మానిఫెస్ట్' లో లేదు. 'ప్యారిస్ కమ్యూన్' అయిన తరువాత ఈ విషయాన్ని చొప్పించాడు. లెనిన్ కాలానికి పెట్టుబడిదారీ విధానం ముదిరి పాకానపడింది. 'Imperialism is the highest stage of capitalism' అని, కమ్యూనిజం ఇంపీరియలిజమ్ Weakest link లో వస్తుందని అన్నాడు. రష్యాలో కమ్యూనిస్ట్ విప్లవం వచ్చింది. అది ఒక ప్రయోగం మాత్రమే. అభివృద్ధి పొందుతున్న వివిధ శాస్త్రాలవల్ల పెట్టుబడిదారీ విధానంలో కార్మిక దోపిడీ విధానం కొనసాగుతున్నా 'hire and fire' పద్ధతి తొలగిపోయింది. కమ్యూనిజంలోని కొన్ని సుగుణాలకు పెట్టుబడిదారీ విధానం తలవంచక తప్పలేదు. కార్మికునికి ఉద్యోగ భద్రత, గ్రాట్యూటీ, ప్రావిడెంట్ ఫండ్, పారిశ్రామిక యాజమాన్యంలో కార్మిక భాగస్వామ్యం కలిగించవలసి వచ్చింది. పెట్టుబడిదారీ విధానానికి ఇది 'మేకవన్నె పులి' అనక తప్పదు.

ఆహార సేకరణనుండి రాజరిక వ్యవస్థవరకు నరుడు అర్థ మానవుడిగానే జీవితాన్ని సాగించాడు. మొదటి పారిశ్రామికవిప్లవం, మొదటి ప్రపంచయుద్ధం సోషలిస్టు రాజ్యావతరణకు కారణాలయ్యాయి. 1970-80ల మధ్యన రెండో పారిశ్రామిక విప్లవం వచ్చింది. దానికి శాస్త్రీయ పరిజ్ఞానాభివృద్ధిలో విశిష్టస్థానం ఉంది అని చెప్పవచ్చు. ఉపగ్రహ సంబంధిత సాంకేతిక పరిజ్ఞానంవల్ల సమాచార విప్లవం ఉదా : టి.వి.లు, వైర్లెస్ సెట్లవల్ల ఒకచోట జరిగినది, ఇంకొకచోటికి లిప్తకాలంలో ప్రసారం అవుతుంది. అణు సాంకేతిక పరిజ్ఞానం వల్ల విద్యుదుత్పత్తి గణనీయంగా పెరిగింది.

'బయోటెక్నాలజీ' ఆవిర్భావంవల్ల అధిక దిగుబడి నిచ్చే వ్యవసాయ విత్తనాలను రూపొందించవచ్చు. పాలు, మరియు చేపల దిగుబడిని పెంచవచ్చు. కొన్ని లక్షల సంవత్సరాల క్రితం వానరుడు నరుడుగా పరిణామం చెందాడు. తరువాత నరుడు మానవుడుగా అత్యున్నత యోచన, మనస్సు కలవానిగా క్రమాభివృద్ధిని చెందాడు. కమ్యూనిస్టు సమాజంలో మానవుడు పరిపూర్ణ మానవునిగా, దివ్యమానవునిగా పరిణతి చెందుతాడని 'ఆంత్రపాలజీ' ధ్వనిస్తోంది. వేదప్రోక్తమైన ఆదిమ కమ్యూనిస్టు సమాజం, L. H. మోర్గాన్, కార్ల్‌మార్క్స్ ప్రవచించిన ఆదిమ కమ్యూనిజం యితోధికతర శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధితో విశ్వమానవాళికి శాస్త్రీయ కమ్యూనిజం ఆవిర్భవించటం అనివార్యం.

# కమ్యూనిస్టు పార్టీ పునర్నిర్మాణం- ఒక అభిప్రాయం

శ్రీ కొల్లి నాగేశ్వరరావు
(ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం ప్రధాన కార్యదర్శి,
కృష్ణాజిల్లా కమ్యూనిస్టు సమితి మాజీ కార్యదర్శి)

"ప్రాథమిక స్థాయిలో పార్టీ యూనిట్ల పునరుజ్జీవానికి తక్షణ కృషి" అనే శీర్షికతో కామ్రేడ్ పరకాల పట్టాభిరామారావుగారు 1996 జనవరి "కమ్యూనిజం" మాసపత్రికలో ఒక వ్యాసం వ్రాశారు. ఈ వ్యాసం యొక్క ప్రోత్సాహంతో తరువాత వరుసగా "కమ్యూనిజం" పత్రికలలో కమ్యూనిస్టు పార్టీ పునర్నిర్మాణం లక్ష్యంగా అనేక వ్యాసాలు వచ్చాయి. ఈ వ్యాసాలు వ్రాసినవారిలో అత్యధికులు, 1935 నుండి 1955 వరకు ఆంధ్రప్రదేశ్‌లో (ఆనాడు ఆంధ్ర, తెలంగాణా) కమ్యూనిస్టు పార్టీ దినదిన ప్రవర్థమానం చెందుతున్న దశలో యువనాయకులుగా ఉండి ఉత్తేజంతో పని చేసినవారు. వారిచ్చే ఆనాటి అనుభవాలు, ఉదాహరణలు తప్పనిసరిగా ఉత్తేజకరమైనవే. అయినా నేడు ఆనాటి ఆచరణను ఆదర్శంగా తీసుకొని ఎందుకు పనిచేయలేకపోతున్నారు? ఎప్పుడు చేయగలరు? ఎవరు చేయాలి? ఎలా చేయాలి? అనే అంశాలపై నా అభిప్రాయాలు తెలియజేస్తున్నాను.

పూర్తిగా సామీప్యత లేకపోయినప్పటికి కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ పరిస్థితిని అర్థం చేసుకొనేందుకు 1941-55 మధ్య కాలాన్ని 1978-95 మధ్య కాలంతో నేను పోల్చుతున్నాను. ఆ కాలంలో కమ్యూనిస్టు పార్టీ రాజకీయ విధానం 1941 నుండి ప్రజా యుద్ధ కాలంలో కాంగ్రెస్ పార్టీ ప్రారంభించిన క్విట్ ఇండియా ఉద్యమంతో సమన్వయంలో కాని, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినదా? రాలేదా? అనే అంశంలో కాని భారతదేశంలో విప్లవం రష్యా పద్ధతిలోనా? చైనా పద్ధతిలోనా అనే అంశాలలో కాని, యూనియన్ సైన్యాలు ప్రవేశించాక తెలంగాణాలో విముక్తి పోరాటంలో సాధించిన విజయాల పరిరక్షణకోసం సాయుధ పోరాటం కొనసాగించాలని, ఈ పోరాటాన్ని ఆంధ్ర ప్రాంతంలో కూడ విస్తృతపర్చాలనే విధానంలో కాని అనేక ఒడుదుడుకులు ఉన్నప్పటికి కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి చెందింది. అందుకు ప్రధాన కారణం రాజకీయ విధానాలెలా వున్నా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, కార్యకర్తలు నీళ్ళలో చేపల వలె ప్రజల మధ్య వుండి పనిచేశారు. వర్గ

పోరాటాలు నిర్వహించడంతో పాటు, ప్రజలకవసరమైన నిత్యావసర సరుకులు వగైరా కంట్రోలు ధరకు సరఫరా చేయించడం లాంటి చర్యల ద్వారా నిత్య జీవితంలో ప్రజలకు తోడ్పడ్డారు. ప్రత్యేకంగా యుద్ధ కాలంలో అధికోత్పత్తి లక్ష్యంతో శ్రమదానం ద్వారా బందరు కాలువ పూడిక తీయడం నుండి అనేక గ్రామాలలో చెరువులు, పంట కాలువల పూడిక తీసి, గండ్లు పూడ్చి ప్రజలకు బాసటగా నిలిచారు. ఆర్థిక విషయాలలోనే కాక, సామాజిక, సాంస్కృతిక వైజ్ఞానిక రంగాలలో కూడా ప్రజా జీవితంలో కలిసిపోయి ప్రజలను ముందుకు నడిపించారు. అందువల్ల రాజకీయ విధానాలు అనేక ఒడుదుడుకులకు లోనయినప్పటికి కమ్యూనిస్టులు ప్రజలకు బాసటగా నిలబడటం ద్వారా ఆనాడు పార్టీ అభివృద్ధి చెందింది.

## కమ్యూనిస్టు ఉద్యమ చీలిక

కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక అనేది కమ్యూనిస్టు ఉద్యమ పురోగమనానికి నివారించలేని ప్రతిబంధకంగా వున్నప్పటికి, 1978 నుండి నేటి వరకు స్థూలంగా దేశంలో రాష్ట్రంలో రాజకీయ విధానం ఒక క్రమంలో వుంది. వామపక్ష ఐక్యతకు అనుకూలంగా వుంది. రాష్ట్రంలో తెలుగుదేశం, సి పి ఐ, సి పి యంలు దేశంలో వామపక్ష ప్రజాతంత్ర, లౌకిక శక్తుల మధ్య ఎన్నికలలో సర్దుబాట్లు చేసుకొంటూ నిర్వహించబడుతుంది.

బి జె పి ఎడల జనతాదళ్ తెలుగుదేశం వగైరాలకు వున్న మెతకదనం కూడా 1989 అనుభవంతో నివారించబడింది. బిజెపి - కాంగ్రెసుకు వ్యతిరేకంగా వామపక్ష, ప్రజాతంత్ర, లౌకిక శక్తుల ఐక్యత స్థూలంగా ముందుకు సాగుతుంది.

1978 నుండి నేటి వరకు దేశంలో, రాష్ట్రంలో రాజకీయ పరిస్థితులు వామపక్ష ఐక్యతకు కాంగ్రెసు - బి.జె.పిలకు వ్యతిరేకంగా సక్రమంగానే ఉన్నప్పటికి కమ్యూనిస్టు ఉద్యమంలో అభివృద్ధిలేదు. కమ్యూనిస్టు పార్టీలో లేదు. మార్క్సిస్టు పార్టీలో లేదు. నక్సలైట్ల గ్రూపులలోను లేదు. ఒక గ్రామంలో ఒకడుగు ముందుకు వేస్తే, మరొక గ్రామంలో ఒకడుగు వెనక్కు వేస్తున్నాయి. అలాగే టవున్స్‌లో కూడా ఎదుగు, బొదుగు లేకుండా వుంది. ఇందుకు ప్రధాన కారణం ఈ కాలంలో రాజకీయ విధానం కమ్యూనిస్టు పార్టీ మరియు వామపక్షాలు ఆశించిన పద్ధతిలోనే ఉన్నప్పటికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, కార్యకర్తలు, వర్గ పోరాటాల నిర్వహణలో కాని, ప్రజాసేవలో కాని, మొక్కుబడి కార్యక్రమాలు తప్ప ప్రజా విశ్వాసం పొందే పద్ధతిలో నిర్వహించలేకపోతున్నారు.

ఆనాడు వర్గ పోరాటాలు, ప్రజా సంక్షేమ కార్యక్రమాలు సమన్వయంతో పట్టుదలతో నిర్వహించారు కాబట్టి ప్రజా మన్ననలు పొందారు. పార్టీ అభివృద్ధి

చెందింది. నేడు వర్గ పోరాటాలు, ప్రజా సంక్షేమ కార్యక్రమాలు నామమాత్రంగా లేదా మొక్కుబడిగా నిర్వహిస్తున్నారు. కాబట్టి ప్రజా మన్ననలు పొందలేకపోతు న్నారు. కమ్యూనిస్టు ఉద్యమం స్థంభించింది.

## వర్గపోరాటాలు ఎంత అవసరమో ప్రజా సేవా కార్యక్రమాలు అంతే అవసరం

కాబట్టి కమ్యూనిస్టు ఉద్యమ పురోగమనానికి సక్రమమైన రాజకీయ విధానం ఎంత అవసరమో, వర్గ పోరాటాలు, ప్రజా సేవా కార్యక్రమాలు అంతే అవసరం. రాజకీయ కార్యక్రమాలలో లోపం వున్నా వర్గ పోరాటాలు, ప్రజాసేవ కార్యక్రమాల ద్వారా పార్టీ అభివృద్ధి చెందిన ఉదాహరణలు ఉన్నవి తప్ప, రాజకీయ విధానం ఎంత సక్రమంగా ఉన్నా ఆ విధానం ఆధారంగా ప్రజలను సమీకరించే వర్గ పోరా టాలు, ప్రజా సేవా కార్యక్రమాలు లేకుండా ప్రజలు ఆ విధానం వైపు రారు. పార్టీకి పురోగమనం ఉండదు. విత్తనం వేసి, నీరు పెట్టి, ఎరువు వేసి, కలుపు తీసి, తెగుళ్ళను అరికడితే సాధారణ విత్తనం కూడా ఎంతో కొంత ఫలసాయాన్నిస్తుంది. ఎంత హైబ్రీడు విత్తనమైనా అవసరమైన పనులు చేయకుండా ఫలసాయాన్ని ఇవ్వ లేదు. అందువల్ల వర్గ పోరాటాలు, ప్రజాసేవ కార్యక్రమాలు కమ్యూనిస్టు పార్టీ పురోగమనానికి జీవనాడులు.

## పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వినియోగించుకోవాలి డివియేషన్సు నిరోధించాలి

ఆనాడు మనం నిర్వహించిన వర్గ పోరాటాలు ప్రజాసేవ కార్యక్రమాలు నేడు ఎందుకు నిర్వహించలేక పోతున్నామని, ఇందుకు కారణం పరిశీలించి సరి చేయడం కమ్యూనిస్టు ఉద్యమ పురోగమనంలో మౌలికాంశం. ఇందుకు నా దృష్టిలో స్థూలంగా విప్లవానికి, లేక విముక్తికి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ సూచించిన విధంగా రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచంలో కమ్యూనిస్టు శిబిరం ఏర్పడి, ప్రపంచ పరిణామాలలో ఒక నిర్ణయాత్మక శక్తిగా అభివృద్ధి చెందు తున్న నేపథ్యంలో, సాయుధ పోరాటమే ఏకైక మార్గం కాదని, పార్లమెంటరీ ప్రజా స్వామ్యాన్ని కూడా సద్వినియోగం చేసుకొనే అవకాశాలు పెరుగుతాయని చెప్ప బడింది. ఈ అవకాశాన్ని భారతదేశంలో కూడా సద్వినియోగం చేసుకోవాలి అని అమృత్‌సర్ మహాసభలో తీర్మానించబడింది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని సద్విని యోగం చేసుకొనే సందర్భంలో పార్లమెంటరీ డివియేషన్సు (ప్రక్కదారులు) మన లను వెంటాడకుండా అప్రమత్తంగా ఉండాలని కూడా చెప్పబడింది. అయితే ప్రస్తుత

అప్రమత్తత ఎంత వరకు పొంటిచబడుతుంది? విప్లవ లక్ష్యం ప్రధానమైనదని, ఆ విప్లవ లక్ష్య సాధనకు పంచాయితీలనుండి పార్లమెంటు వరకు ఒక స్రవంతి మాత్ర మేననే స్పృహ మనం ఎంతవరకు కలిగి ఉంటున్నాము? ఎందుకు కలిగి ఉంటు న్నాము? విప్లవ లక్ష్య సాధనలో వర్గ పోరాటం, ప్రజా సేవా కార్యక్రమాలు కూడా ప్రధాన స్రవంతులేననే లక్ష్యంతో మనం ఎంతవరకు అసలుజరుపుతున్నాము?

ప్రధానమైన విప్లవ లక్ష్యం తీర్మానాలలో, ఉపన్యాసాలలో వున్నప్పటికి ఆచరణలో మరుగునపడింది. గ్రామ సర్పంచిగానో, శాసనసభ్యుడిగానో, పార్లమెంట్ సభ్యుడిగానో, ఎలా కావాలనే లక్ష్యం గణనీయమైన వారిలో ప్రధాన ఆలోచనగా మారింది. గతంలో ప్రజాబలం కలిగిన పార్టీలతో ఎన్నికల సర్దుబాటులు లేక పూర్వం ఏదో ఒకస్థానానికి ఎన్నిక కాబడాలంటే కొందరు కాకపోతే కొందరు అయినా ఎంతో కొంత ప్రజాసేవ నేయడం అవసరమని భావించేవారు. ప్రస్తుతం ప్రజాబలం కల పార్టీలతో ఎన్నికల సర్దుబాటు చేసుకొంటున్నందువల్ల ప్రజాసేవ చేయడం కంటే సర్దుబాట్లు చేసుకొనే ప్రజాబలం కల పార్టీ నుండి మనం సీటు ఎలా పొందా లని, ఆ సీటుకు మన పార్టీలో తన ప్రతిపాదనలు ఎలా నెగ్గించుకోవాలనే ఆలోచ నలు పెరిగిపోయి విప్లవ లక్ష్యానికి ప్రధాన సోపానాలైన వర్గ పోరాటం, ప్రజాసేవ కార్యక్రమాలు మరుగున పడ్డాయి.

నేనిలా వ్రాస్తున్నానంటే ప్రస్తుతం దేశంలో, రాష్ట్రంలో వామపక్ష ప్రజా తంత్ర లౌకిక శక్తుల మధ్య ఎన్నికల సర్దుబాట్లకు నేను వ్యతిరేకం కాదు. ప్రస్తుతం అనుసరించే రాజకీయ విధానం సరియైనదనే నా దృఢ విశ్వాసం. అయితే విప్లవ లక్ష్యానికి ప్రధాన సోపానాలైన వర్గ పోరాటం, ప్రజాసేవ కార్యక్రమాలు నిర్వహించి ప్రజా మన్ననలు పొందడం ప్రధాన విధానంగా వుండాలి. పార్లమెంటరీ విధా నాన్ని ఇందుకు దోహదంగా వినియోగించుకోవాలి. ఈ అంశం మనం అనుక్షణం మననంలో ఉంచుకోవాలి. కార్యకర్తలను ఈ అంశంపై చైతన్యవంతులను చేయాలి. అలాగే విప్లవలక్ష్యానికి పార్లమెంటరీ విధానం సక్రమంగా వినియోగించుకొనేవారు, వర్గపోరాటం, ప్రజాసేవ కార్యక్రమాలకు ప్రాధాన్యతనిచ్చే నాయకులు, కార్య కర్తలు పార్టీలో అసలు లేరని కాదు. వున్నారు. కొద్దిమంది ఉన్నారు. ఆ మేరకు అయినా కొందరు ఉన్నారు. కాబట్టే ప్రస్తుతం పార్టీ ఈ మేరకు నిలబడి ఉన్నది. గణనీయమైన సంఖ్యలో పార్లమెంటరీ డివియేషన్ను వైపు పయనిస్తున్నారు. వీరి శాతం క్రమంగా తగ్గించాలి. సక్రమంగా వినియోగించుకొనే వారి శాతం పెరగాలి. పార్టీ లోపల ఈ అంశంపై శాఖ నుండి జాతీయస్థాయి వరకు తీవ్రమైన చర్చ జర గాలి. పార్టీ సభ్యులను చైతన్యవంతులను చేయాలి.

ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించేప్పుడు కూడా పార్లమెంటరీ డివియేషను బలహీనతకల వారికంటే విప్లవ లక్ష్యంతో పనిచేసే వారికి ప్రాధాన్యతనివ్వాలి.

క్రమంగా ఈ మార్పు తీసుకురావాలి. ఈ మార్పు తీసుకురావడం వ్రాసినంత తేలిక కాదు. విప్లవ లక్ష్యాన్ని నమ్మిన ప్రతి ఒక్కరు పార్టీని పద్ధతిలో నడిపించడం కోసం అవసరమైన చర్చలకు సిద్ధపడాలి. త్యాగాలకు సిద్ధపడాలి. అప్పుడే ఈ లోపాన్ని సవరించగలం. పార్టీని పట్టుదలతో నిర్మించగలం.

పార్లమెంటరీ బలహీనతలు ఒక వైపు పార్టీని వెంటాడుతుంటే ఆర్థిక బలహీనతలు మరొక వైపున వెంటాడుతున్నవి. ఈ బలహీనతల నుండి బయట పడేందుకు నైతిక ప్రమాణాలు పెంచేందుకు క్రమంగా పట్టుదలతో కృషి చేయాలి.

## సహకార సంస్థలు, స్థానిక సంస్థలు ఆదర్శంగా నిర్వహించాలి

నేడు పంచాయితీలు, సహకారసంఘాలు వగైరా నిర్వహణలో ఇతరపార్టీల వారికి కమ్యూనిస్టులకు మధ్య పెద్దగావ్యత్యాసం ఉండడంలేదు. కమ్యూనిస్టులు ఇలాంటిసంస్థలను ఆదర్శంగా నిర్వహిస్తే ప్రజాభిమానం పొందవచ్చును. కమ్యూనిస్టు ఉద్యమం పురోగమిస్తుంది. ప్రస్తుతం భారతదేశంలో ఏదో ఒక సహకారసంఘంలో ప్రతినలుగురిలో ఒక్కరు సభ్యులుగా వుంటున్నారు. సహకార సంఘాలను సక్రమంగా పని చేయిస్తే ప్రతి ఒక్కరు ఏదో ఒక సహకార సంఘంలో సభ్యులుగా చేరే అవకాశం ఉంది. సహకార పరపతి సంఘాలు కాని, మిల్కు సొసైటీలు కాని, చేనేత సొసైటీలు కాని, గీత సొసైటీలు కాని, ఫీల్డు లేబరు కో ఆపరేటివ్ సొసైటీలు కాని వగైరా అనేకం ఉన్నవి. నేడు భూమిలేని వ్యవసాయ కార్మికులను కూడా వన సంరక్షణ సమితుల ద్వారా సహకార సంఘాలలో చేర్పించే అవకాశం వచ్చింది. చిన్నకారు, సన్నకారు రైతుల సహకార సంఘాలు పెట్టవలసిన అవసరం వుంది. నైతిక ప్రమాణాలతో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు ఏదో ఒక సహకార సంఘానికి బాధ్యత వహించి జయప్రదంగా నిర్వహిస్తే శాంతియుతంగా ప్రజాస్వామ్యయుతంగా రాష్ట్రంలో, దేశంలో కమ్యూనిస్టులు అధికారానికి రావడానికి సూటైన బాట. సహకార సంఘాలను జయప్రదంగా నిర్వహించే వ్యక్తులను, పార్టీలను ప్రజలు వెన్నంటి వుంటారు.

1987లో జరిగిన సొసైటీ ఎన్నికలలో కృష్ణాజిల్లా వీరులపాడు సొసైటీలో కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థి కామ్రేడ్ వట్టికొండ నాగేశ్వరరావుగారిని ఓడించేందుకు కమ్యూనిస్టు పార్టీ అనుకూల ఓట్లుకంటే వ్యతిరేక ఓట్లు రెట్టింపు ఉండే విధంగా ఇతర గ్రామాలను కూడా చేర్చి లక్షన్నర రూపాయలపైగా ప్రత్యర్థులు వెచ్చించినప్పటికి ఆర్థిక విషయాల నిర్వహణలో నిప్పులాంటి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థికే ఓటిస్తామని చెప్పి ప్రజలు మంచి మెజారిటీతో గెలిపించారు. ఇలాంటి ఉదాహర

ణలు అనేకం ఇవ్వవచ్చును. అందువల్ల నేడు సమాజంలో ఆర్థిక సహకార సంఘా లకు పెరుగుతున్న ఆదరణ అర్థంచేసుకోవాలి. నేడు గుజరాత్‌లో ఆనంద్ పాలసహ కార సంస్థ అధినేత డా॥ కురియన్ ప్రపంచ ప్రసిద్ధి కాంచాడు. కోడిగుడ్ల సహకార సంఘంద్వారా గుడ్లరేటు క్రమబద్ధీకరించటంతో డా॥ బి.వి. రావుగారి చొరవతో నేడు భారతదేశంలో లక్షలాదిమందికి ఉపాధి ఏర్పడినది. సహకార సంస్థలను సక్రమంగా నిర్వహించుట ద్వారా ఆ బాధ్యతలు నిర్వహించే పార్టీ హోల్ టైమరు సంస్థనుండి ఆర్థిక సహకారం పొందవచ్చును. ఆ సంస్థను నిర్వహిస్తూనే ఆ గ్రామ పార్టీని కూడా సక్రమంగా నిర్వహించవచ్చును. సమాజంలో కూడా అనేకులు నైతిక ప్రమాణాలు కలవారు వుండబట్టే ప్రస్తుతం అనేక అవినీతి కుంభకోణాల కాలవాల మైన సమాజంలో అనేక సహకార సంఘాలు జయప్రదంగా నిర్వహించబడుతున్నవి. కమ్యూనిస్టులు సహకార సంఘాలను సక్రమంగా నిర్వహించడంపై పట్టుదల వహిస్తే సమాజంలోని నైతిక ప్రమాణాలు కల ప్రజలు కూడా మనవైపు ఆకర్షితు లౌతారు. హోల్ టైమర్సు ఆర్థిక సమస్యలు పరిష్కారమవుతాయి. పార్టీ అభివృద్ధి చెందుతుంది. అయితే కుటుంబ నిర్వహణకు తగిన ఆదాయంతో తృప్తి చెందుతూ విప్లవ లక్ష్యంతో ప్రజాసేవ చేయవలసిన అవసరాన్ని చైతన్యాన్ని పార్టీ కార్యకర్త లలో కలుగ చేయాలి.

నేడు ప్రభుత్వ నిర్వహణలో నష్టాలపాలవుతున్న అనేక సహకార సంస్థలను తీసుకుని నిర్వహించే అవకాశం వుంది.

అందువల్ల ప్రస్తుతం పార్టీ హోల్ టైమర్సుకు, కార్యకర్తలకు ఆర్థిక సమ స్యల పరిష్కారానికి, కమ్యూనిస్టు పార్టీ పురోగమనానికి నైతిక ప్రమాణాలతో సహ కార సంస్థల నిర్వహణ ఎనలేని అవసరమనే అంశాన్ని కూడా కమ్యూనిస్టులు తీవ్రంగా ఆలోచించాలి. గ్రామ స్థాయినుండి జాతీయ స్థాయివరకు తీవ్రంగా చర్చిం చాలి. కమ్యూనిస్టు పార్టీలో నైతిక ప్రమాణాలను పెంపొందించుకొంటూ సహకార సంస్థలను జయప్రదంగా నిర్వహించేందుకు పూనుకోవాలి.

## నూతన విధాన అమలుకు నూతన కార్యక్రమం రూపొందించాలి

నేను పైన తెలిపిన రెండు అంశాలు మౌలికమైనవి. 20వ పార్టీ మహాసభలో నూతన ప్రపంచ పరిస్థితులలో శాంతియుత, ప్రజాస్వామ్యయుతమైన పద్ధతులను, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని సద్వినియోగం చేసుకొనే అవకాశం ఏర్పడినదనే సూచన ఆధారంగా ఈ విధానాన్ని అనుసరించాలనుకొనే భారతదేశ పార్టీలలో ఈ అంశాలపై వివరణాత్మకమైన చర్చ జరగాలి. ఈ విషయాలపై చర్చించి నిర్దిష్ట

కార్యక్రమం రూపొందించటం ఎనలేని అవసరం. కమ్యూనిస్టు ఉద్యమ పురోగమనానికి నూతన పరిస్థితులలో అనుసరించవలసిన నిర్దిష్ట విధానాల లక్ష్యంతో శాఖలను పనిచేయించేందుకు పూనుకుంటే ఉత్సాహపడతారు. కదులుతారు. పనిచేస్తారు. విషయంతో రూపం ముందుకు సాగుతుంది తప్ప (కంటెంటు - ఫారమ్) విషయంతో సంబంధం లేకుండా రూపానికి ప్రాధాన్యత వుండదు.

## వెంటనే కార్యక్రమం ప్రారంభించాలి

కొందరు కామ్రేడ్స్ తాము పనిచేయక పోవటానికి కారణం రాజకీయ విధానం తమకు నచ్చలేదనో, విప్లవం వీధి మూలకు రాలేదు లెమ్మనో కారణాలతో దాటవేస్తూ ఉంటారు. రాజకీయ విధానం అందరికీ ఆమోదయోగ్యంగా సాధారణంగా వుండదు. మెజారిటీ కాని లేక అత్యధికులకు కాని ఆమోదయోగ్యంగా వుంటుంది. కొందరు కామ్రేడ్స్‌కు ఆ గ్రామంలో ఆ మండలంలో లేక ఆ జిల్లాలో లేక ఆ రాష్ట్రంలో పరిస్థితులు భిన్నంగా వుండవచ్చును. భారతదేశంలో అన్ని రాష్ట్రాల రాజకీయ పరిస్థితులు ఒకే విధంగా వుండవు. అలాగే ఆంధ్రప్రదేశ్‌లో అన్ని జిల్లాల రాజకీయ పరిస్థితులు ఒకే విధంగా వుండవు. అందువల్ల ఒక రాజకీయ విధానంతో కొందరు విభేదించినప్పటికి ప్రజాస్వామ్య కేంద్రీకరణ సూత్రాలననుసరించి విప్లవ లక్ష్యంతో అంతా అమలు జరపాలి, పార్టీ అభివృద్ధికి తోడ్పడాలి.

విప్లవం కనుచూపుమేరలో వున్నదని ఎవ్వరు చెప్పలేరు. విప్లవానికి ఏ దేశంలోను కాలం ఎవరు నిర్ణయించలేరు. మార్క్స్, లెనిన్ మహనీయులే అలా సాహసించలేదు. విప్లవ లక్ష్యాన్ని విశ్వసించే కమ్యూనిస్టులు విప్లవ ఫలితాలను అనుభవించ కలిగినా లేకున్నా మహోన్నతమైన విప్లవ ఆశయంపైన, సోషలిజంపైన విశ్వాసంతో పనిచేయాలి. ఏ త్యాగానికైనా సిద్ధంగా నుండాలి.

మరొక వాదన కూడా చేస్తుంటారు. భారతదేశ కమ్యూనిస్టు వుద్యమంలో జాతీయ నాయకత్వం రూపొందలేదని, అందువల్ల సువిశాలమైన భారతదేశంలో సుదూర భవిష్యత్తులో విప్లవం అంతుపట్టనిదని. నేటికి జాతీయ నాయకత్వం రూపొందకపోవడం వాస్తవం కావచ్చు. జాతీయ నాయకత్వం చారిత్రిక క్రమంలో రూపొందుతుంది తప్ప జాతీయ నాయకత్వం రూపొందడం కోసం వేచిచూస్తూ ఎవరి ఇంట్లో వారు కూర్చుంటే జాతీయ నాయకత్వం రూపొందేందుకు భౌతిక పరిస్థితులు కూడా వుండవు కదా! అందువల్ల మనకు జాతీయ నాయకత్వంలేదనో, ఎవరో వస్తారనో అశాస్త్రీయమైన పద్ధతులలో వేచి చూడకుండా ఒక గ్రామాన్ని ప్రభావితం చేయకలిగిన కామ్రేడ్ గ్రామాన్ని ప్రభావితం చేయాలి. మండలాన్ని ప్రభావితం చేయకలిగిన కామ్రేడ్ అందుకు ప్రయత్నించాలి. జిల్లాని, రాష్ట్రాన్ని ఎవరి స్థాయిలో

వారు పనిచేస్తుందేనే జాతీయ నాయకత్వం ఏనాటికైనా ఆవిర్భవిస్తుంది. విప్లవాన్ని నిర్వహిస్తుంది.

సర్ ఆర్థర్ కాటన్ చెప్పినట్లు అంతకు పూర్వం ఒక్క గడ్డిపరక పెరుగుతూంటే నీవు మరొక గడ్డిపరక పెరిగేందుకు తోడ్పడితే దేశం అభివృద్ధి చెందుతుంది.

జాతీయ విప్లవ లక్ష్యం రూపొందించాలన్నా, జాతీయ నాయకత్వం రూపొందాలన్నా ముందు ప్రజలలో పనిచేయాలి. అలా పనిచేసే క్రమంలో కొన్ని లోపాలు సవరించబడతాయి. పనిచేస్తూ పార్టీలోపల సాగించే చర్చలలో సరియైన కార్యక్రమం రూపొందించబడుతుంది. నాయకత్వం అభివృద్ధి చెందుతుంది. అందువల్ల ప్రజలలో పని ముఖ్యం.

## శాఖ సమావేశాలలో చర్చించాల్సిన అంశాలు

ఈ లక్ష్యంతో పనిచేయాలి. ఈ లక్ష్యంతో శాఖలను సమావేశపర్చాలి. ఆ శాఖలలో వ్యవసాయ కార్మికులకు సంబంధించి అలాగే సన్నకారు, చిన్నకారు రైతులకు సంబంధించి వనసంరక్షణ సమితులను ఎలా నిర్మించాలి? ఎలా నిర్వహించాలి అని చర్చించాలి. అటు ఆక్రమణ పోరాటం, యిటు నిర్వహణ కార్యక్రమం రూపొందించాలి. అమలు జరపాలి. సన్నకారు, చిన్నకారు రైతులకు సబ్సిడీలు సాధించినవి లబ్దిదారులకు అందించడంపైన అవసరమైనవి సాధించడం పైన చర్చించి అమలు జరపాలి. చేతి వృత్తులు వారికి, యస్. సి., యస్. టి, బి. సిలకు సబ్సిడీలతో కూడిన ఉపాధి పథకాలు అమలుపై చర్చించాలి. అమలు జరిపించాలి. వృద్ధాప్యపు పెన్షన్లు, వ్యవసాయ కార్మిక పెన్షన్లు, వితంతు పెన్షన్లు అమలు జరిపించాలి. రైతులకు గిట్టుబాటు ధరలు పంటలబీమాపథకం, నీటి సదుపాయం వగైరా అంశాలపై చర్చించి ఆందోళనా కార్యక్రమం రూపొందించాలి. అలాగే మహిళలకు మహిళా మండలులద్వారా అమలు జరిపే ఉపాధి కార్యక్రమాలు అమలు జరిపించాలి. అత్యాచారాలను ప్రతిఘటించేందుకు పూనుకోవాలి. యువజనులకు నిరుద్యోగ సమస్య పరిష్కారానికి అవసరమైన ఆందోళనా పోరాటం నిర్వహించాలి. ఉపాధి కల్పనా కార్యక్రమం సక్రమంగా అమలు జరిపించాలి. అలాగే కార్మిక సమస్యలు, విద్యార్థి సమస్యలు, అన్ని వర్గాల సమస్యల పైన గ్రామ శాఖలలో లేక పట్టణ శాఖలలో ఆయా వర్గాల సమస్యలపైన చర్చించి కార్యక్రమం రూపొందించేందుకు దోహదంగా శాఖా సమావేశాలు నిర్వహించాలి. నేను పైన తెలిపిన రాజకీయ సిద్ధాంత అంశాల మీద కూడా చర్చించాలి. కమ్యూనిస్టు వుద్యమ పురోభివృద్ధికి తోడ్పడాలి.

# సేవా కార్యక్రమాలు

సమస్యలపై వర్గపోరాటాలు నడుపుతూ ఆ ఫలితాలు ప్రజలకు అందించేందుకు సేవా కార్యక్రమం నిర్వహించాలి. సేవా కార్యక్రమంలో ఆర్థిక సేవలేకాక ఒక కుటుంబానికి వైద్య సదుపాయం అవసరమైనా, యింట్లో వివాహం వగైరా వేడుకలు నిర్వహించుకొనుటలోను, లేక ఘర్షణలలో, పోలీసు కేసులలో, యాక్సిడెంట్‌లలో, అనారోగ్య సందర్భాలలో వివిధ రూపాలలో సహాయపడాలి. ప్రజలకు కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త ఆపద్బాంధవుడుగా వుండాలి. మానవతామూర్తిగా కనిపించాలి. ఏ అనుభవం చూసినా నైతిక ప్రమాణాలు కలిగి సహాయపడే నాయకత్వం ఎడల ప్రజలు ఆకర్షితులవుతారు. కమ్యూనిస్టు వుద్యమం అభివృద్ధి చెందుతుంది. కమ్యూనిస్టు వుద్యమం వైపు వర్గ పోరాటం ద్వారా, ప్రజా సేవా కార్యక్రమాల ద్వారా సామాన్య ప్రజలు ఆకర్షితులైతే, మేధావులు, ధనిక వర్గాలలో కొందరు విప్లవాశయం ఎడల, సోషలిజం ఎడల ఆకర్షితులైవస్తారు. వీరు సిద్ధాంతాల అధ్యయనం ద్వారా, చర్చలు ద్వారా ఆకర్షితులవుతారు. వీరికి కూడా వర్గ పోరాటాలు, నిత్య ప్రజా కార్యక్రమాలు ఉత్తేజాన్నిస్తాయి.

---

"మన రాష్ట్రంలో పార్టీ పత్రికలు ఎన్నిశాఖలకు వెడుతున్నాయి? కొత్త ప్రాంతాలకు తీసుకు వెళ్ళడం ద్వారా పార్టీ సంబంధాలు పెరగడానికి ఏ మేరకు దోహదం చేస్తున్నారు? పార్టీ సభ్యుల మొత్తం రాజకీయ స్థాయి పెరగాలన్నా పోరాటాలను ముందుకు తీసుకు వెళ్ళాలన్నా పార్టీ నిర్మాణ రీత్యా విస్తృతపరచ డానికి ఈ కర్తవ్యాలను పూర్తి చేయవలసిన అవసరంలేదా? అందుకే పార్టీ పత్రికల సర్క్యులేషన్ పెరుగుదలకు పార్టీ యంత్రాంగం కృషి చేయాలి."

శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావు
లెనిన్ వరవడిలో పార్టీ పత్రికలు
1975 జూన్ కమ్యూనిజం నుండి

---

# డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం

- శ్రీ పరకాల పట్టాభిరామారావు

జీవ పరిణామం గురించి తొలిసారిగా శాస్త్రీయ సిద్ధాంతం రూపొందించిన చార్లిస్ డార్విన్ (1809 - 1882) ప్రతిపాదించిన సూత్రాలు వివరంగా పరిశీలించుదాం.

జలచరములు - కొన్ని లక్షల కోట్ల సంవత్సరాల తరువాత ఉభయ చరములుగా, ఉభయ చరములు కొన్ని లక్షల కోట్ల సంవత్సరాల తరువాత పూర్తి భూచరములుగా, భూచరములు కొన్ని లక్షల సంవత్సరాల తరువాత నాల్గు కాళ్ళు కల్గిన క్షీరదములు(పాలిచ్చి పెంచేవి)గా, నాల్గుకాళ్ళు కల్గిన జంతువులు కాలక్రమేణా రెండు కాళ్ళు కల్గిన జంతువులుగా మార్పుచెందాయి. సరీసృపములు క్రిమికీటకాల నుండే గాలిలో ఎగిరే పక్షి జాతులు ఏర్పడ్డాయి. నాల్గు కాళ్ళలో ముందు రెండు కాళ్ళు-చేతులుగా మారాయి. రెండు కాళ్ళ జంతువుల నుండి చింపాంజీ, గెరిల్లా మొ॥ కోతుల నుండి చివరకు నేటి మానవ ఆకారం ఆవిర్భవించింది.

## ఈ మార్పులు ఎలా సంభవించాయి ?

ప్రకృతి ఎంపిక (Natural Selection) లేక ప్రకృతి వాతావరణానికి అనుగుణ్యంగా పరివర్తన (Adoptation to the environment) వలన ఈ ప్రధాన పరిణామం సంభవించింది.

నీటిలో ఉండగా జీవకణంలోవున్న జీవరసంజీవ-ద్రవంలో అదే రక్తం-చల్లగా ఉంటుంది. చేప, కప్ప, తిమింగలం తదితర జల జీవరాసుల రక్తం ఉష్ణ రక్తం కాదు. చల్లనిరక్తం (Cold blood) నీరు చల్లన. శీతల ప్రవాహాలు ఉష్ణ ప్రవాహాలు నీటిలో ఉన్నప్పటికీ మొత్తం మీద నీరు చల్లగానే ఉంటుంది. అందుచేత పూర్తి జలచరాల రక్తం చల్లగానే ఉంటుంది.

జలచరాలలో ప్రాథమిక దశ జీవకణం ఎముకలులేని వెన్నెముకలేని జీవ పదార్థం (ఎమీబా, జెల్లీస్టార్ చేప (Star-fish)వగైరా) వీటికి నిర్దిష్ట ఆకారం లేదు.

తరువాత వెన్నెముక ఏర్పడింది. చేపకు వెన్నెముక ఉంది. తిమింగలానికి వెన్నెముక ఉంది. మొసలికి వెన్నెముక ఉంది. వెన్నెముక ఏర్పడిన తరువాత జలచర్యాలకు నిర్ణీత ఆకారం ఏర్పడింది.

జలచరములకు ఊపిరితిత్తులు (Lungs) ఏర్పడలేదు. నీటిలో ఉన్న ప్రాణ వాయువును నీటి నుండి వడపోసే పువ్వారాలు లేక మొప్పలు మాత్రమే ఉండేవి.

జలచరములు గుడ్లు మాత్రమే పెడతాయి. గుడ్లు పిల్లలవుతాయి. అలాగే క్రిమి కీటకాలు, సరీసృపములు గుడ్లను మాత్రమే పెడతాయి. పక్షులు కూడా గుడ్లను మాత్రమే పెడతాయి. అందుచేత పునరుత్పత్తి (Reproduction) చేసే అవయవాలు ఎలా ఉండాలో అలానే ఉన్నాయి. అంటే వీటికి గర్భాశయం ఏర్పడలేదు.

ఆహారం, నిద్ర, మైదునాలు (స్వజాతి ఉత్పత్తి) స్వజాతి రక్షణ సకల జీవ కోటి సహజ లక్షణాలు.

జలచరాలు నీటిలో పెరిగే నాచు మొక్కలు చిన్న చిన్న జలచరాలను మ్రింగుతాయి. అదే ఆహారం. జలచరాలు కూడా నిద్ర (లేదా విశ్రాంతి) పోతాయి. నీటిలో ఉండి దొరకకుండా పోవడమే స్వరక్షణ. కొన్ని చేపలకు (సొర చేప-తిమింగలం వగైరాలకు) పదునైన ముట్టె లేదా తోకలు ఉంటాయి. వాటితో స్వరక్షణ చేసుకుంటాయి. మొసలికి పదునైన పళ్ళుగల పొడవాటి ముట్టె, అలాగే చేపలకు ముళ్ళు ఉంటాయి.

జలచరాలకు - ప్రకృతి ఎంపిక (Natural selection లేదా Adoptation to environment) ఎలా వర్తించాయో ప్రకృతి పరిసరాలకు, వాతావరణానికి అనుగుణ్యంగా ఎలా రూపొందాయో చూశాం. (చల్లని రక్తం, గుడ్లను పెట్టడం, ప్రాణవాయువును నీటినుండి మాత్రమే గ్రహించడం వగైరా)

మత్స్యన్యాయం అనే మాటకూడ ఉంది. పెద్దచేప చిన్నచేపను మింగుతుంది. చేపలను మొసళ్ళు, తిమింగలాలు ఇతర పెద్ద జంతువులు మ్రింగుతాయి. చిన్న చేపను పెద్ద చేప మింగటమే మత్స్యన్యాయం. పెట్టుబడిదారీ విధానంలో పెద్ద పెట్టుబడిదారులు చిన్న పెట్టుబడిదారులను, మధ్యరకం పెట్టుబడిదారులను మ్రింగివేస్తారు. జీవకోటిలో వర్తించే ఈ మత్స్యన్యాయం జంతుజాలానికి, సామాజిక ఆర్థిక రంగాలకు కూడా వర్తించుతుంది. ఈ విషయం ముందు ముందు చూద్దాం.

## ఉభయ చరములు

నీటిలోను, భూమిపైన నివసించే ప్రాణులను ఉభయ చరములు అని పిలుస్తారు.

నీటిలో ఉండే జీవజాలం క్రమంగా భూమిమీదకు రావడం జరిగింది. అప్పుడు భూమిమీద జీవించే విధంగా అవయవ నిర్మాణం మార్పు చెందసాగింది. ప్రాణికి మున్ముందు కావలసింది ప్రాణవాయువు. గాలి నుండి ప్రాణవాయువును తీసుకోవాలి.




అంటే ఊపిరితిత్తులు కావాలి. మొప్పలు స్థానంలో క్రమంగా ఊపిరితిత్తులు అభివృద్ధి పొందసాగాయి.

కప్ప: నీటిలోని ప్రాణవాయువును తీసుకోగలదు. భూమిమీద ప్రాణవాయువును తీసుకోగలదు. కొన్ని లక్షలు, లేదా కోట్ల సంవత్సరాలలో ఈ విధంగా ఒక్కొక్క అవయవము అభివృద్ధి పొందసాగాయి. అదే విధంగా తాబేలు, మొసలి మున్నగునవి. మత్స్యావతారం నుండి కూర్మావతారం వచ్చింది కదా, (కూర్మం-అంటే తాబేలు)గాలిలోని ప్రాణవాయువును తీసుకోగల్గే ఉచ్ఛ్వాస-నిశ్వాస (**Respi-**

ratory) యంత్రాంగంతో పాటు, ఆహారం, కదలిక, పునరుత్పత్తి మొదలైన జీవ కార్యకలాపాలతో కూడా క్రమంగా ఉభయ చరములలో మార్పులు రాసాగాయి.

చేప పాకలేదు. ఒడ్డున వేస్తే గిలగిలా కొట్టుకొంటుంది. కొంతసేపటికి చచ్చిపోతుంది. కప్ప రెండు కాళ్ళతో గెంతుతుంది. మొసలి నాల్గు జతల కాళ్ళతో పాకుతుంది. ఇలా కదలిక అవయవాలలో మార్పు క్రమంగా వచ్చింది. పాము కూడా జర్రున పాకిపోతుంది తప్ప దానికి కాళ్ళులేవు.

ఇవన్నీ గుడ్లుపెట్టే జీవకోటి అంటే కడుపు లోపల పునరుత్పత్తి అవయ వాలు వీటికి అభివృద్ధి చెందలేదు. అంటే గర్భకోశము అభివృద్ధి చెందలేదు. మరొక ఆసక్తికర విషయం, జీవకోటిలో లింగ విభజన.

## లింగ విభజన ఎప్పుడు ఏ దశలో ఎలా జరిగింది ?

ఏకకణజీవి అమీబా దశలో లింగ విభజనలేదు. అంటే ఆడ, మగ అనే తేడాలేదు. ఒకటి రెండుగాను, రెండు నాల్గుగాను విడిపోవడమే తప్ప, ఆడ మగ లింగ విభజన జరగలేదు. వానపాము కూడా అంతే. వానపామును సగం ముక్క తెంచితే మిగిలిన సగం పాకిపోతుంది. అలాగే జలగకూడా. ఆడ మగ లింగబేదం జరగని జీవజాలాన్ని హెర్మోప్రోడైట్సు (Hermo–prodites) అంటారు.

వెన్నెముక ఏర్పడిన జీవజాలం నుంచే లింగ విభజన జరిగినట్లు కనబడు తుంది. చేప, కప్ప, మొసలి-లింగ విభజన జరిగింది. పక్షులలో లింగ విభజన జరిగింది.

లింగ విభజన జరిగిన తరువాత ఆడమగ జీవకోటి సంయోగం (ఆడమగ బీజముల కలయిక) ద్వారా పునరుత్పత్తి ప్రారంభమైంది. జీవపరిణామంలో ఇదొక పెద్ద అంగ, పెద్ద మార్పు. వృక్ష జాతులలో కూడా ఈ లింగ విభజన జరిగింది.

## జీవన సంఘర్షణ
### (Struggle for exhistance)

ప్రతిజీవికి గల మరొక ప్రధాన లక్షణం జీవించి ఉండటంకోసం సంఘర్షణ పడాలి.

జీవించాలి అంటే ముందు ఆహారం కావాలి. ఆహారంకోసం వెతుక్కోవాలి. వెతుక్కోవడంలో ఇతర జీవజాలంతో ఘర్షణ పడాలి. అంతేకాదు చిన్న జంతువు పెద్ద జంతువుకు ఆహారం అయిపోతుంది.

చిన్నచిన్న పురుగులను క్రిమికీటకాలను కప్ప తింటుంది. కప్పను పాము

మింగుతుంది. పామును ముంగీస వేటాడి తింటుంది. (పాముపెట్టే గుడ్లను పామే తింటుందని చెబుతారు.) చేప, కప్ప తదితర జీవజాలం పెట్టే లక్షలాది గుడ్లు అన్నీ బ్రతికితే ఒకరకం జీవజాలం (Species) తోనే ప్రపంచం నిండిపోతుంది. అందుచేత ఇతర పెద్ద జీవజాలానికి అవి ఆహారం అయిపోతాయి. అలాగే స్టార్ ఫిష్ ఏడాదికి పది లక్షల గుడ్లు పెడుతుంది. ఇవన్నీ స్టార్ చేపలైతే సముద్రాలు నిండిపోతాయి.

అందుచేత గుడ్లదశలోనే నశించి పోవడం, లేదా ఆహారంగా పెద్ద జంతువుల నోళ్ళలోకి పోవడం గాని, ఆవిధంగా నశించిపోతాయి. గుడ్లు పిల్లలుగా మారినా ఇదే సంఘర్షణ సూత్రం వర్తిస్తుంది.

జంతువులలో కూడా ఇదే జీవన సంఘర్షణ జరుగుతుంది. కుందేలు, మేక, గొర్రె, లేడి, ఏనుగు మొదలైనవి తోడేలు, పులి, సింహం మొదలైన పెద్ద జంతువులచే వేటాడబడతాయి. మగపిల్లికూనలను మానుపిల్లి (మొగపిల్లి) కొరికి చంపివేస్తుంది.

ఆహారంకోసం సంఘర్షణ, స్వజాతి రక్షణకోసం సంఘర్షణ, ప్రకృతితో సంఘర్షణ, శత్రు జంతువులతో సంఘర్షణ, ఈ విధంగా జీవించి ఉండటంకోసం పడే సంఘర్షణలను తట్టుకొనగల్గినవే గెలుస్తాయి. ప్రకృతి వైపరీత్యాలు-ధూకంపాలు, తుపానులు, అగ్ని ప్రమాదాలు వగైరా ప్రకృతి ఉత్పాతాలతో కూడా జీవకోటి సంఘర్షించాలి. హిమపాతం (మంచుతాపాను) జలప్రళయం (ఉప్పెన వగైరాలు) వరదలు మున్నగు ప్రకృతి వైపరీత్యాలతో తట్టుకొని జీవించాలి. కొన్ని కొన్ని సందర్భాలలో కొన్ని జీవజాతులు నశించిపోతాయి. ఉదాహరణకు రాక్షస బల్లులు (డైనోసోర్సులు) హిమపాతం జరిగినప్పుడు పూర్తిగా నశించిపోయాయి.

## అర్హత కలిగినవే బ్రతుకుతాయి
## (Survival of the fittest)

ఇటువంటి జీవిత సంఘర్షణలో ఏవి బ్రతికి బట్టకడతాయి? ఏవైతే తట్టుకొని నిలబడగలవో, వేటికైతే బ్రతికేబలం, ప్రమాదాలను తప్పించుకొనే శక్తి సామర్థ్యం ఉన్నదో అవే బ్రతుకుతాయి.

లేడికి లేచిందే పరుగు అని సామెత. తోడేలు, పులి, సింహం తరుముకొని వచ్చినప్పుడు లేడి, దుప్పి వాటికంటే వేగంగా పరుగెత్తగల్గినప్పుడే అవి తప్పించుకోగలవు. కుందేళ్ళు, లేడి, దుప్పి మున్నగునవి పొదలలో దూరి రక్షణ చేసుకోగలవు. సింహాలను ఎదుర్కోడానికి ఏనుగులు సామూహికంగా ఎదురు తిరిగి పోరాడతాయి.

అందుకనుగుణ్యంగానే వాటి శరీర నిర్మాణం మార్పు చెందుతుంది. లేడి,

గుర్రం కాళ్ళు పొడుగుగా, బలంగా తయారవుతాయి.

స్వజాతి రక్షణకు అన్ని జంతువులకు సహజ లక్షణాలు కల్గి ఉంటాయి. పంది, కుక్క, ఆవు, పిల్లి మున్నగునవి ఈనినప్పుడు వాటి పిల్లల దగ్గరకు ఎవరినీ రానియ్యవు. మనుషులను చూస్తే మామూలుగా పారిపోయేవి చాలా భయంకరంగా ఎదురుతిరిగి కరిచివేస్తాయి. ఆవులు కొమ్ములతో కుమ్మివేస్తాయి. ఈ ఎదురుదాడి చేసే లక్షణం (Ferocity) ఆ పిల్లలను కన్న సమయంలోనే సహజసిద్ధమైన లక్షణంగా బైటకు (Instinct) వస్తుంది.

## ప్రకృతి వాతావరణానికి అనుగుణ్యంగా మార్పు
### (Adoptation to Environment)

ఉత్తర దక్షిణ ధృవ ప్రాంతాల్లో ఉండే జంతువులకు మంచులో, మంచు నీటిలో ఉండగల్గే విధంగా ఉన్ని చర్మం ఏర్పడుతుంది. సీల్, డాల్ఫిన్, పెంగ్విన్ పక్షులు వగైరా. ఉష్ణమండల ప్రాంతంలో జంతువులకు ఆయా శీతోష్ణ స్థితిగతులనుబట్టి బొచ్చు చర్మం ఏర్పడుతుంది. కోతులు, ఎలుగుబంట్లు వగైరా.

పసిరిక పాములు ఆకుపచ్చ రంగులో ఉంటాయి. చెట్లమీద, పచ్చగడ్డిలోను ఉంటే ఆ రంగులో కలిసిపోతాయి.

గొల్లభామ ఎండుగడ్డిలో ఉండే ఆ రంగు, పచ్చగడ్డిలో ఉంటే ఆ రంగు మార్చుకుంటుంది.

ఊసరవెల్లి (తొండముదిరితే పూసరవెల్లి) తాను ఉండే ప్రదేశాన్ని బట్టి రంగులు మార్చుకుంటుంది. రాజకీయంగా రంగులు మార్చేవారిని రాజకీయ ఊసరవెల్లి అంటారు.

పులిచారలు అడవిలో చెట్ల నీడల మధ్య వాతావరణంలో కలిసిపోవడానికి వీలుగా ఉంటుంది. (సైనికులు చారలు చారలు గల దుస్తులు వేసుకుంటారు. తలమీద చెట్ల ఆకులు ధరిస్తారు. విమానాలమీద నుంచి చూస్తే వాళ్ళను పై నుంచి గుర్తుపట్టడం కష్టం. ట్యాంకులకు, సైనిక మోటారు వాహనాలకు చెట్ల ఆకులు మాదిరి కనబడే రంగులు వేస్తారు. దీనిని Com flouge ప్రకృతి వర్ణంలో కలిసిపోయే ముసుగు అమర్చుకోవడం)

జంతువులు ఆయా వాతావరణాని కనుగుణ్యంగా రంగులు మార్చుకోవడం Com flouge రక్షణ కవచంలా ఉపయోగపడుతుంది.

## జిరాఫీ మెడ

గుర్రం జాతికి చెందిన జిరాఫీ అనే జంతువు మెడ పొడుగ్గా ఉంటుంది.

కాళ్ళు చాలా ఎత్తుగా ఉంటాయి. క్రిందనుండే చెట్ల ఆకులను, పొదలమీద ఆకులను అందుకోగలదు. జిరాఫీ మెడ అలా ఆహారం అందుకోవడం కోసం పొడుగ్గా తయారైంది.

సింహం, పులి, తోడేలు జంతువులను వేటాడడానికి కాలిగోళ్ళు బలంగా, వాడిగా ఉంటాయి. సింహం ఏనుగు కుంభస్థలిని కొట్టి మెదడు తింటుంది. అంత బలంగా, అంత వాడిగా దాని ముందరి కాళ్ళు, కాళ్ళగోళ్ళు తయారవుతాయి.

ఏ అవయవాలతో ఎక్కువ పనిచేస్తుంటే ఆ అవయవాలకు రక్తం ప్రసరిస్తుంది. ఆ అవయవం బలంగా తయారవుతుంది.

చేతులతో పని చేసేవారి చేతికండరాలు బలిష్టంగా వంపులు తీరి ఉంటాయి. ఎక్కువ నడిచేవారి కాలి పిక్కలు, తొడలు బలిష్టంగా కండలు తిరిగి ఉంటాయి.

మేధోశ్రమ - మెదడుతో ఎక్కువ శ్రమ చేసేవారి మెదడు బాగా అభివృద్ధి అవుతుంది. వారి ఆలోచనాశక్తి, గ్రహణశక్తి, ఊహాశక్తి, జ్ఞాపకశక్తి పెరుగుతాయి. బ్రాహ్మణ పురోహిత వర్గాలకు మేధా శక్తి ఎక్కువ. క్షత్రియులకు భుజ బలం ఎక్కువ, అంటే ఏ అవయవంతో ఎక్కువ పని చేస్తే ఆ అవయవం బాగా ఎదుగుతుంది.

శారీరక వ్యాయామం చేస్తే కండరాలు పెరుగుతాయి. బలిష్టంగా ఉంటాయి. కండరాలను కదిలించి మల్లయోధులు ప్రదర్శించగలరు (Muscle Control)

అంటే దీనినిబట్టి మనకు తేలేది ఏమంటే అవసరాలనుబట్టి అవయవాలు పరిణామం చెందుతాయి. ప్రకృతి వాతావరణాన్నిబట్టి శరీరరంగు గుణ గణం మార్పు చెందుతుంది. ఎండ ఎక్కువగా ఉండని చలిదేశాలలో మనుషుల చర్మాలు తెల్లగా ఉంటాయి. ఉష్ణదేశాలలో మనుషుల చర్మాలు నల్లగా ఉంటాయి. ఎండవేడిమి ఎక్కువ తక్కువలను బట్టి ఇలా రంగులు మారతాయి. ఇది కూడా ప్రకృతిని పట్టి వచ్చిన మార్పు, పరివర్తన. (Adoptation to the environment)

శారీరక శ్రమ చేసేవారి శరీరం ఎదుగుతుంది. మానసిక శ్రమ చేసేవారి మెదడు పెరుగుతుంది.

ఇలా కొన్ని వేల, లక్షల, కోట్ల సంవత్సరాల కాలంలో ఏకకణ జీవినుండి మానవుని వరకు జీవ పరిణామం, జీవ జాతుల పరిణామం అభివృద్ధి క్రమంలో ముందుకు సాగుతూ వచ్చింది.

వాతావరణ పరిస్థితులను, శీతోష్ణ స్థితులను, నివసించే ప్రదేశాలను బట్టి జీవ పరిణామం, స్వరూప, స్వభావం, రంగు, ఆకారం, అవయవ నిర్మాణం మారుతూ జీవరాసులు ఒక్కొక్క దశ దాటి కొత్త రూపం, కొత్త జాతులు ఉద్భవించాయి. డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం నాల్గు సూత్రాలు మనం మళ్ళీ చెప్పుకొందాం. అవి

1. ప్రకృతి ఎంపిక (Natural Selection) ఇందులో భాగమే ప్రకృతికి అనుగుణ్యంగా పరివర్తన (Adoptation to environment) 2. జీవించి ఉండడం కోసం సంఘర్షణ (Struggle for exhistance) 3. అర్హత కల్గినవే మనగల్గుతాయి (Survival of the fittest) మిగిలినవి అంతరించిపోతాయి.

## జీవపరిణామంలో శ్రమ యొక్క పాత్ర

ఏకకణ జీవినుండి మానవుని వరకు జరిగిన జీవ పరిణామంలో శ్రమ యొక్క పాత్ర ప్రధానమైనదని చెబుతూ ఫ్రెడరిక్ ఏంగిల్స్ ఇలా అన్నాడు.

"హస్తం కర్మేంద్రియం మాత్రమేగాక కర్మజన్యమని కూడా చెప్పాలి. కేవలం పనుల మూలంగానే, నిరంతరం నూతన క్రియలకు అనువుపడుట వల్లనే సంపాదించబడిన కండరాభివృద్ధి సంతానానికి సంక్రమింపజేయబడుతూ వచ్చింది. చాలా తరాల నుంచి ఈ రీతిగానే ఎముకలను అభివృద్ధి చెందించుకొని సంతానానికి సంక్రమింపజేస్తూ వచ్చారు.

"మానవుని ఆయుర్ధాయంలో ఒక క్షణము వలెనే, మన భూమి వయస్సులో లక్షల సంవత్సరాలు అత్యల్పతమ భాగమని చెప్పాలి. శాఖాచరములైన వానర మూక నుండి భూమిచరులైన మానవ సంఘము ఉదయించేందుకు కొన్ని లక్షల సంవత్సరాలు గడచి ఉంటుందనేది నిస్సంశయము. ఎట్లో చిట్టచివరకు మానవ సంఘం ఉద్భవించింది. ఐతే వానర మూకలకు, మానవ సంఘాలకు గల ప్రధాన భేదం ఎందులో ఉంది. కర్మలోనే (పని, కృషి, శ్రమ చేయుట లేక క్రియా కారకత్వం)."

నాల్గు కాళ్ళ జంతువులు ముందు రెండు కాళ్ళను ఉపయోగించి వివిధ పనులు చేయడం, అనగా ఆకులలము అందుకోవడం, చెట్ల కొమ్మలను పట్టుకొని ఎక్కడం క్రమంగా రాతి పనిముట్లు వాడటం, ఈ విధంగా శ్రమ చేయడం వలెనే అవి కొన్ని వేల, లక్షల సంవత్సరాల తరువాత చేతులుగా మారాయి. చతుష్పాద జంతువులు ద్విపాద జంతువులుగా, కోతులుగా మారాయి.

ఒక అవయవము మారితే దాని ప్రభావం ఇతర అవయవములమీద ఉంటుంది. ఇదే అభివృద్ధిలో పరస్పర సంబంధము (Law of co-eletion of growth)

కోతి యొక్క స్వర పేటిక క్రమంగా మాట్లాడగలిగిన మానవుని స్వర పేటికగా ఎలా మారిందో ఏంగిల్స్ ఇలా చెప్పాడు.

"కర్మ కౌశలములో అభివృద్ధి చెందుతూ వస్తున్న మానవులు ఒక నిర్దిష్ట దశ వచ్చేసరికి ఒకరితో ఒకరు ఏదో ఒకటి చెప్పవలసిన అవసరం ఏర్పడింది. ఆ అవసరమే, అగత్యమే అందుకు కావలసిన అంగాన్ని సృష్టించుకుంది. కోతి యొక్క

స్వరపేటిక (లారింక్స్) ఇదివరకు అభివృద్ధి చెందియుండనిది. బహు మెల్లగా మార్పు చెందుతూ వచ్చింది. కర్మల నుంచి - కర్మ క్రమంలో భాష అనేది ఉద్భవించిందనేది జంతువులతో పోల్చి చూచుట వల్ల కూడా నిజమని తేలుతుంది."

ప్రకృతిలోని వస్తువులను సంపదగా మార్చుటలో శ్రమ ఎంత ప్రధాన పాత్ర వహిస్తుందో జంతు దశ నుండి మానవ దశకు జీవపరిణామం చెందడంలో శ్రమ అంత ప్రధాన పాత్ర వహిస్తుందని ఏంగిల్స్ అత్యంత ప్రతిభావంతంగా నిరూపించాడు.

జీవించడానికి సంఘర్షణ అనే సూత్రంద్వారా జీవపరిణామం ఎలా ముందుకు జరిగిందో డార్విన్ చెప్పిన దానిని ఏంగిల్స్ మరింత వివరంగా శ్రమ యొక్క పాత్ర సూత్రం ద్వారా చెప్పారు.

జీవించడానికి సంఘర్షణ అన్న దానిలో "సంఘర్షణ" పదంలోనే శ్రమ ఇమిడి ఉందని ఏంగిల్స్ నిర్వచించారని చెప్పవచ్చు.

## మేధస్సు క్రమ పరిణామం

పదార్థం యొక్క అత్యున్నత అభివృద్ధి దశ మానవుని మేధస్సు లేక మెదడు అని శాస్త్రజ్ఞులు చెబుతారు (Highest development of matter is mind).

మేధస్సు ఎలా క్రమంగా అభివృద్ధి చెందిందో చూస్తే జీవపరిణామం ఎలా జరిగిందో కూడా మనకు అర్థం అవుతుంది.

వంశపారంపర్యా వచ్చే సహజ లక్షణాలు (Instincts) మనకు అన్ని జంతువులలోను కనబడతాయి.

తాబేలు గుడ్డునుంచి పిల్ల ఐన తరువాత నీటివైపే అది నడుస్తుందట. ఏ వైపున నీరు లేదా జలాశయం ఉన్నదో దానికి ఎలా తెలిసింది? దానికున్న మెదడు ఆలోచనలో సహజగుణం అది.

ఆవు దూడను యీనుతుంది. దూడ తల్లిపొదుగువైపు వెడుతుంది. పాలు కుడుస్తుంది. కడుపులోంచి భూమిమీద పడగానే లేచి నిలబడుతుంది. ఈ రెండు ఎవరు నేర్పారు? సహజసిద్ధ గుణం, స్వభావసిద్ధమైన లక్షణం.

పక్షులకు రెక్కలు వచ్చేంతవరకు గూటిలోనే ఉంచి కాపాడుతూ తల్లి పక్షి ఆహారం తినిపిస్తుంది. రెక్కలు రాగానే పిల్ల పక్షి ఎగిరిపోతుంది. తల్లి పిల్ల సంబంధం సమాప్తి. ప్రేమ అనుబంధం సమాప్తి. ఎవరి జీవిత సంఘర్షణ వారిదే. అదే జంతువులలో కనబడుతుంది.

కుక్కలు, ఆవులు, గొర్రెలు, పిల్లులు, పక్షులు మనుషులచే పెంచబడినవి మరికొన్ని అదనపు లక్షణాలు కల్గి ఉన్నాయి. అవి యజమానిని గుర్తించగలవు,

సంతోషంతో తోకను ఆడిస్తాయి, మీదపడి నాకుతాయి. మేతకు పోయిన ఆవులు, గేదెలు, ఎద్దులు తిన్నగా ఇంటికే చేరతాయి. ఇల్లు ఎలా ఆనమాలు కడతాయి? పరిసరాల పరిజ్ఞానం, వాసన పసికట్టుట మున్నగునవి గుర్తించే దశకు ఈ జంతువుల మేధస్సు ఎదిగింది. పెంపుడు జంతువులకు, అడవి జంతువులకు మెదడు తేడా ఉంది. పెంపుడు జంతువులకు కొన్ని అదనపు లక్షణాలు వచ్చాయి.

కుక్కలు పసికట్టగలవు. పోలీసులు వినియోగించే కుక్కలు నేరస్తుని జేబురుమాలు, లేదా అడుగు జాడల వాసననుబట్టి నేరస్తులు ఎటు వెళ్ళారో సూచించగలవు. అల్సేషియన్ కుక్కలు తప్పిపోయిన పిల్లలను వెతుక్కురాగలవు. కొన్ని కుక్కలు ఇంట్లో పనివారు పనిచేసి వెళ్ళిపోతున్నప్పుడు వారి చేతుల్లో ఏవైనా సామాను పట్టుకొని పోతున్నదీ లేనిదీ తనిఖీ చేయగలవు. పెంపుడు పక్షులు, పెంపుడు జంతువులు తమ పంజరాలకు, పశువుల కొట్టాలకు వాటంతటవి చేరుకోగలవు.

సర్కసు జంతువులు కుక్కలు, సింహాలు, పులులు, గుర్రాలు సంజ్ఞలను బట్టి, శబ్దాలను బట్టి గ్రహించి పనులు చేయగలవు. చిలుకలు, మైనాలు మాటలను పాటలను ఉచ్చరించగలవు.

చీమలు, తేనెటీగలు వాటి జీవిత కార్యకలాపాలు చూస్తే ఆశ్చర్యకర విషయాలు మనకు కనబడతాయి. వాటి పని విభజన మనకు ఆశ్చర్యం గొల్పుతుంది.

ఖడ్గతిక్కన యుద్ధంలో చనిపోతే అతని తలను అతని గుర్రం నోట కరిచి ఇంటికి తీసుకొని వస్తుంది. యుద్ధంలో తన యజమాని చనిపోతే ఇంటికి తీసుకొని వస్తుంది. యజమాని చనిపోతే కుక్కలు ఆహారం తినవు. అంతిమయాత్ర జరిగిన చోటకి తిరిగి వస్తుంటాయి.

పందిని చంపడానికి తీసుకుపోతుంటే చివరి క్షణం వరకు తప్పించుకోదానికి పోరాడుతుంది. చంపడానికి తీసుకు వెడుతున్నట్లు దానికి ఎలా తెలుస్తుంది?

ఓడ మునిగిపోయే సూచనలు, భూకంపం వచ్చే సూచనలు ఎలుకలకు, పక్షులకు ముందే కొంత తెలుస్తుంది. దీనిని Rat sense అంటారు. ఇక్కడ Instinct సహజసిద్ధ లక్షణం వ్యక్తమవుతుంది.

మెదడు అనేది ఏర్పడి వివిధ జంతువులలో క్రమంగా అభివృద్ధి పొందుతూ మానవుని దశవచ్చేసరికి పరిపూర్ణంగా (మానవ మేధస్సు) అది అభివృద్ధి చెందుతుంది.

జంతువును మనిషిని విడదీసే ప్రధానమైనది మేధస్సు. ఆలోచన, అవగాహన, జ్ఞాపకశక్తి, విచక్షణ, వూహాశక్తి మొ॥ వాటి ద్వారా ప్రకృతిని అర్థం చేసుకొని, దానిని మార్చగల్గిన శక్తి మానవునికి అబ్బడానికి ముందు వివిధ జంతుదశలగుండా మెదడుఅనే పదార్థం అభివృద్ధి చెందుతుంది.

ఈ అన్ని జంతు సహజ లక్షణాలను (Animal Instincts) కల్గి ఉండటంతోపాటు మానవ మేధస్సు అత్యున్నతమైన ఆలోచన, జ్ఞానం, జ్ఞాపకం, తదితర లక్షణాలను కల్గి ఉంటుంది.

డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం, జంతుదశ నుండి మానవుని దశవరకు మెదడు పొందిన అభివృద్ధి క్రమం చెబుతుంది.

వివిధ మతాలు జీవం పుట్టుక, పెరుగుదల గురించి, మానవుని పుట్టుక పెరుగుదల గురించి చెప్పినవన్ని కేవలం వూహలు తప్ప వాస్తవం కాదని డార్విన్ సిద్ధాంతాలు నిరూపించాయి.

(సశేషం)

| ఈరా | పిరియడ్ | జీవచరిత్ర | ఎన్ని కోట్ల సంవత్సరాల క్రితం |
|---|---|---|---|
| నవ్య జీవదశ (సీనోజోయిక్) | క్వేటర్నరీ | మానవులు | 0.1 |
| | టెర్షియరీ | స్తన్య జంతువుల విస్తృతి | 7½ |
| మధ్య జీవదశ (మెసోజోయిక్) | క్రిటేసియన్ | డైనోసార్స్ వినాశనం ఆదునిక పక్షిజాతులు, స్తన్య జంతువులు | 13½ |
| | జురాసిక్ | డైనోసార్స్ వ్యాప్తి, పక్షుల ఆవతరణ | 16½ |
| | ట్రియాసిక్ | డైనోసార్స్ మొదటిసారిగా ప్రత్యక్షం గ్రుడ్లు పెట్టే స్తన్య జంతువులు | 20½ |
| పురాజీవదశ (పేలియోజోయిక్) | పెర్మియన్ | వెన్నెముకలేని సముద్రపు జంతుజాతులు అనేకం నశించాయి. ఈనాటి పురుగుల జాతులు | 23 |
| | పెన్సిల్వేనియన్ కార్బోనిఫెరస్ (మిసిసిపియన్) | మొదటి సరీసృపాలు ఉభయచర జంతువులు | 28 |

| ఈరా | పీరియడ్ | జీ వ చ రి త్ర | [illegible] |
|---|---|---|---|
| | (డివోనియన్) | మొదటిసారిగా అరణ్యాలు, మొదటి ఉభయచర జంతువులు | 32½ |
| | సైలూరియన్ | నేలపై వృక్షజాతుల వ్యాప్తి జాదలు రెక్కలులేని పురుగులు | 36 |
| | అర్డోవిసియన్ | వెన్నెముకగల జంతువులు–చేపలు | 42½ |
| | కేంబ్రియన్ | వెన్నెముకలేని జంతువులు, విస్తారంగా అవశేషాలు | 50 |
| పూర్వ జీవదశ (ప్రోటిరోజోయిక్) | | జీవకోటి అవశేషాలు అత్యల్పం, ఆల్గా, ప్రోటోజోవా (ఏకకణ జీవులు) | 200 |
| ప్రథమ జీవదశ (ఆర్కియోజోయిక్) | | జీవకోటి చిహ్నలు దాదాపుగా లేవు, జీవకోటి ప్రాదుర్భావం | 260 |
| నిర్జీవ దశ (ఎజోయిక్) | | జీవకోటి లేదు | 450 |

ఇది జియలాజికల్ క్యాలెండర్ — జీవ పరిణామం కాల విభజన

(దీనిని క్రింది నుంచి పైకి చదువుకోవాలి)

శ్రీ నండూరి రామమోహనరావు రచించిన—నరావతారం నుండి

(డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం)

## అనుబంధం - 1

జీవ పరిణామ క్రమంలోనే పిండోత్పత్తి పరిణామ క్రమం ఉండటం చాలా ఆశ్చర్యంగొల్పే విషయం.

స్త్రీ, పురుష బీజాలు కలిసి తల్లి కడుపులో పిండోత్పత్తి ప్రారంభమవుతుంది. ఈ మానవ పిండం మొట్టమొదట ఏకకణ జీవిగా ఉంటుంది. తరువాత దినం దినం, వారం వారం ఈ ఏకకణ జీవి రెండుగా, నాల్గుగా, ఎనిమిదిగా, పదహారుగా అభివృద్ధి చెందుతుంది.

ఏకకణ జీవి ఎమీబా నుండి మానవావతారం వచ్చే వరకు ఎన్నెన్ని రూపాలుగా మార్పు చెందిందో అన్ని రూపాలను ధరిస్తుంది. సుమారు మానవ పిండం నూరురూపాలను ధరిస్తుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

మొదట జలచరం - చేప వలె-రెండే గదులున్న గుండె ఏర్పడుతుంది.

తరువాత ఉభయచరం- కప్పవలె మూడు గదులున్న గుండె ఏర్పడుతుంది. చిట్టచివరకు పాలిచ్చి పెంచే జంతువులవలె, పక్షులవలెనే నాల్గు గదులున్న గుండె ఏర్పడుతుంది.

ఈ విధంగా ఎదుగుతున్న మానవ పిండం మెడ ప్రాంతంలో చేపవలె రెండు మొప్పలు ఏర్పడతాయి. (చేప ఈ మొప్పల ద్వారానే నీటిలో ఉండే ప్రాణ వాయువును పీల్చుకుంటుంది) ఆ మొప్పలే ఆ తరువాత శిశువుకు రెండు పూపిరి తిత్తులుగా మారిపోతాయి.

కొన్ని వారాల తరువాత ఈ పిండానికి ఒక చిన్న తోక వంటిది ఏర్పడుతుంది. అది చివరకు వెన్నెముక చివరి పూసగా మారుతుంది.

కోతికి తోక ఉంటుంది. మనుష్య ఆకారం వచ్చేసరికి ఈ తోక ఉడిగిపోతుంది. చివరి పూసగా మారిపోతుంది.

అలాగే జంతువులకు, కోతులకు ఉండే కోరల వంటి పళ్ళు మొదట ఉంటాయి. అవి క్రమంగా శిశువు ఎదిగిన కొలదీ మిగిలిన పళ్ళతో కలిసిపోతాయి. జంతు దశలో ఇవి మాంసాన్ని చీల్చి తినడానికి ఉపయోగపడేవి. ఆ తరువాత మనుష్యుని ఆహారపు అలవాట్లలో మార్పు రావడంతో కోరపళ్ళు కూడా మామూలు పళ్ళవలె మారిపోయాయి.

నవమాసాలు మోసి తల్లి బిడ్డను కనే సమయానికి ఈ తొమ్మిది నెలల కాలంలో ఏకకణ జీవి నుంచి మానవుని ఆకారం వచ్చేవరకు ఏ యే జంతురూపా

లుగా జీవ పరిణామం జరిగిందో ఇంచు మించు అన్ని రూపాలు పిండానికి వస్తాయని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. (ముందు చేప ఆకారం, తరువాత కప్ప ఆకారం, తరువాత సరీసృపాలు అనగా పాము వివిధ పురుగులు తరువాత నాల్గు కాళ్ళ జంతువు ఆకారం వగైరా.)

అలాగే శిశువు పుట్టిన కొన్నాళ్ళ తరువాత కాళ్ళులేని సరీసృపాలవలె పొట్ట మీద పాకడం తరువాత నాల్గుకాళ్ళ జంతువువలె చేతులమీద, మోకాళ్ళ మీద ఆని పాకడం తరువాత పడుతూ, లేస్తూ కాళ్ళ మీద నిలబడటం (మనం విద్దేలుచేయడం అంటాం.) మానవ శిశువు నేర్చుకుంటుంది. కోతి ఆకారంలో ఉన్నప్పుడు చేతులు కూడా కాళ్ళవలె ఉపయోగించడం జరుగుతుంది. చింపాంజి, గెరిల్లా కాళ్ళమీద నడుస్తాయి. క్రమంగా మానవ శిశువు లేచి తప్పటడుగులు వేస్తుంది.

పిల్లలు పెద్దలు ఏ మాట చెపితే ఆమాట అంటారు. దీనినే చిలక పలుకులు అంటాం. మానవుని బాల్యావస్థను అల్లరి చిల్లరిగా ఉండటాన్ని కోతి చేష్టలతో పోలుస్తారు. కోతి చేష్టలకు అర్థం - అన్ని వస్తువులు లాగడం. క్రింద పడవేయడం వగైరా. పిల్లలు సరిగా (పెద్దవాళ్ళవలె నడవరు) గెంతుతూ నడుస్తారు. కంగారు అనే జంతువు చేతులు పొట్టిగా ఉంటాయి. వెనకాల కాళ్ళతో గెంతుతుంది. కుందేలు గెంతుతుంది. ఈ విధంగా సూక్ష్మంగా పరిశీలిస్తే, మానవజీవితం - పిండోత్పత్తిదశ నుండి జీవపరిణామ దశల గుండా పయనించి (జలచరములు, ఉభయచరములు, భూచరములు) మానవాకార లక్షణాలు పొందుతుంది.

ఏకకణ జీవి నుండి - మానవాకారం రావడానికి కొన్ని లక్షలు లేదా కోట్ల సంవత్సరాలు పడితే మానవ పిండం తొమ్మిది నెలల్లోనే యించు మించు ఈ అన్ని రూపాలను ధరించడం పరమాద్భుత విషయంగా మనకు గోచరిస్తుంది.

ఇదంతా భగవంతుని సృష్టి, దైవమహిమ అని మానవుడు ఒక్కమాటతో సంతృప్తిచెంది ఒక్క నమస్కారం చేయడం సహజం. కాని ఈ సృష్టి అంతా ఒక క్రమంలో వివిధ దశలలో సాగుతూ వచ్చిందని మానవుడు నేడు గ్రహించగల్గాడు. ఇది భగవంతుని మాయ అనుకొని వేదాంతం చెప్పుకోవచ్చు కాని శాస్త్రీయ విజ్ఞానం శాస్త్రీయ పరిశోధనలను బట్టి - నేటికి అనేక పరమాద్భుత విషయాలను మానవుడు కనుగొన్నాడు. ఈ శాస్త్రీయ పరిశోధనలకు పరాకాష్ట డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం.

అయితే ఈ నాటికి బ్రహ్మదేవుడో, లేక యహోవాయో లేక అల్లా చేతులతో పిండితోగాని, మట్టితో గాని బొమ్మలను చేసి వాటికి ప్రాణం పోశారని అనుకుంటున్నవారు లేరా? అంటే ఈనాటికీ ఉన్నారు. ఆయా మతాలలో జీవం, జీవకోటి, జీవపరిణామం గురించి ఈనాటికీ ఎన్ని రకాల విశ్వాసాలున్నాయో వేరే చెప్ప

నక్కరలేదు. చంద్రుడు ఒక నిర్జీవ ఘన పదార్థంతో, శిలలతో కూడిన గోళం అని మానవుడు స్వయంగా దానిపై కాలుమోపిన తరువాత కూడా చంద్రుని ఒక దేవతగా భావించేవారు భావించవచ్చు. కాని అది యథార్థం కాదు అనేమాట కాదనగలరా ?

మతం మూఢనమ్మకాలను పెంచిపోషిస్తుంది. సైన్సు, మూఢనమ్మకాలను పటాపంచలు చేస్తుంది.

కోపర్నికస్, గెలీలియో, బ్రూనో, ఆర్యభట్టు అడుగు జాడలలోనే డార్విన్ కూడా మానవ విజ్ఞానాన్ని వికసింపజేసి అజరామరుడై నేటికి, ఏనాటికీ మన స్మృతి పథంలో నిల్చి ఉంటాడు.

---

"మానవునికి మానవుడే సర్వోత్తమ ప్రాణి అనే సిద్ధాంతంతో మత విమర్శ అంతమవుతుంది. మానవుడు తక్కువ యోగ్యంగా, బానిసగా, నిర్లక్ష్యం చేయబడి అవమానించదగ్గ ప్రాణిగా ఉన్న పరిస్థితులను అధిగమించడానికి తప్పనిసరిగా స్పష్టమైన చర్యలు తీసుకోవాలి."

— కారల్ మార్క్స్

* * *

"ఈ ప్రపంచంలో మానవుణ్ణి మించిన దేమీలేదు. సర్వగామి దేవుడు మనకు అందనివాడు, సర్వ వ్యాపితమైన దేవుడు మానవునిలోనే ఉన్నాడు."

— సర్వేపల్లి రాధాకృష్ణ

---

## తత్వశాస్త్రం అంటే ఏమిటి ? (5)

# గతితార్కిక భౌతికవాదం

శ్రీ రాళ్ళబండి వెంకటేశ్వరరావు

జడవాదం అటు యిటు తిరిగి ఆఖరికి భావవాదం వేపు ముల్లు వొంచుతుంది. యాంత్రిక భౌతికవాదం దీనికి అన్న. యంత్రంతో పోలిక తెచ్చి సృష్టిక్రమానికి అన్వయించడం వల్ల యీ పొరపాటు వస్తుంది. ఉదాహరణకి యంత్రం వుంది, ఓ గడియారం వుంది. అన్నీ అమరిస్తే అవి తిరుగుతాయి, కాని అవి తిరిగేటట్టు చెయ్యడానికి వో చోదకుడు కావాలి. ఒకసారి తిరగడం మొదలుపెడితే యిక చోదకుడి అవసరం లేదు. ఇదే రీతిలో భూమి, గ్రహాలు తిరుగుతున్నాయి. చోదకుడు వాటిని అలా తిప్పడం దాకా తెచ్చాడు. ఇలా వో 'కర్త'ని యెక్కడ్నుంచో తేవడం భావవాదానికి తలుపు తెరవడం అవుతుంది. అలాగే యీ ధోరణిలో మరో పొరపాటు వుంది. గడియారం, యంత్రం వగైరా తిరుగుతాయి, భూమీ తిరుగుతుంది, ప్రకృతిలోనూ యిది పునరావృతం అవుతుంది అనే వాదన వినిపిస్తుంది. కాని యంత్రం చలనానికి చరిత్ర లేదు, యంత్రం కాబట్టి! భూమికి, ప్రకృతికి చలనం మార్పు వుంటాయి. ఈ చలనానికీ, మార్పుకీ చరిత్ర వుంటుంది. ఈ విషయం జడవాది గమనించడు.

ఆలోచనలో నిత్యజీవిత వ్యవహారానికి, లోకజ్ఞానానికి సన్నిహితంగా జడవాదం వుంటుంది. నిజమే కాని ఆ 'సాన్నిహిత్యాన్ని' అంతటితోనే వుంచి, ఆ "లోట్లు" లేకుండా ఆలోచన వుండాలి. సందేహాలకి, శేష ప్రశ్నలకి తావు లేకుండా ప్రకృతి గురించి, సమాజం గురించి, మనిషి గురించి వివరించ గలగాలి.

భౌతికవాదం పరిణామంలో అలాంటి సమగ్ర అవగాహన యివ్వగలిగిన సిద్ధాంతం పందొమ్మిదవ శతాబ్దంలో ఆవిర్భవించింది. మానవజాతి సాధించిన విజయాలకి మకుటాయమానంగా వచ్చిన సిద్ధాంతం అది. ఆ సిద్ధాంతం అప్పటిదాకా పరిణతి చెందిన శాస్త్రవిజ్ఞాన ఆధారంగా వచ్చిందే అయినా, "మానవ పురోగమన మార్గాలు" తెరిచింది. సత్యసమన్వితమైన, సమగ్రమైన సిద్ధాంతం అది. జడవాద ధోరణిలో పాలు సవరించుకొని, భౌతికవాదం సర్వ సౌష్టవంగా శోభిల్లే సిద్ధాంతం అది.

"ప్రపంచాన్ని అంతా ముందే సిద్ధం చేసి వుంచిన వస్తు సముదాయంగా అర్థం చేసుకోకూడదు. పరిణామక్రమ సంక్లిష్టమైందిగా గ్రహించాలి. పైగా

స్థిరంగా కనిపించే వస్తువులు వాటి మానసిక ప్రతిబింబాలైన భావాలతో సహా నిరంతరం మార్పుకి లోనవుతూ వుంటాయి. కాగా ఈ దృక్పథం నుంచే సర్వదా పరిశోధన సాగించే శాశ్వత పరిష్కారాలు, శాశ్వత సత్యాలు అనే వాటి కోసం శోధించడం నిలిచిపోతాయి. సత్యం, అసత్యం, మంచి, చెడ్డ, అభిన్నము, విభిన్నము, ఆవశ్యకత, యాదృచ్ఛికత అనుభవాల మధ్య అధిగమించ వీలులేని వైరుధ్యాలున్నాయన్న పాత జడవాద దృష్టికి శోధకుడు బానిస కాబోడు" అని ఏంగిల్స్ రాశాడు.

అలా బానిస కానివ్వని శోధనే గతితార్కిక పద్ధతి, సత్య సమన్విత, సమగ్ర భౌతికవాద సిద్ధాంతం గతితార్కిక భౌతికవాదం. ఆధునిక పరిపుష్ట భౌతికవాదం, ఇదే మార్క్సిస్టు సిద్ధాంతం.

గతితార్కిక పద్ధతి యేమిటి? గతితార్కిక భౌతికవాద సిద్ధాంతం యేమిటి? అవేమిటో చూద్దాం.

## గతితార్కిక పద్ధతి

జడవాదం ప్రకృతి అనేక వస్తువుల పోగు అంటుంది. దేనికది విడివిడిగా ఉన్నాయని అంటుంది. కాని గతితార్కిక పద్ధతి అలా చెప్పదు. ప్రతి దానికీ పరస్పర సంబంధం ఉంది. ఒక దానిమీద ఒకటి ఆధారపడింది, ఒకదాన్ని ఒకటి ప్రభావితం చేస్తుంది, ఒకదాన్ని ఒకటి నిర్ణయిస్తుంది అని చెపుతుంది. అంచేత దేన్నీ కూడా దాని మానాన్న దాన్ని విడదీసి ఒంటికాయ సొంటి పిక్క వంతుగా చూడరాదు. ఏదీ ఒంటెత్తు రామలింగడు బాపతుగా ఉండదు అని చెపుతుంది. చెట్టు ముందా విత్తు ముందా అని గిరిగీసి చూడ్డం పుండదు అని చెపుతుంది.

జడవాదం స్థిరోభవ వరదోభవ అని వస్తువులు అచలంగా మారకుండా ఉన్నాయని వస్తుకర దీపిక సూత్రీకరణలు చేస్తుంది. కాని గతితార్కిక పద్ధతి ప్రతిదీ మారుతూ ఉంటుంది అనీ, చలనంలో వుంటుంది అనీ, కొత్తది వస్తూ ఉంటుంది అనీ, అభివృద్ధి చెందుతూ ఉంటుందనీ చెపుతుంది. ఎప్పుడూ ఏదో కొత్తది ఉత్పన్నం అవుతూనే ఉంటుంది, ఎప్పుడూ ఏదో శిథిలం అయి నశించిపోతూనే ఉంటుంది అని చెపుతుంది. అంటే ఏమన్న మాట? వస్తువులకి పరస్పర సంబంధం ఉందన్న ముక్క చెప్పడమే కాదు, వాటికి చలనం వుంది, మార్పు చెందుతాయి, అభివృద్ధి చెందుతాయి, ఉనికిలోకి వస్తాయి, నశింపు పొందుతాయి అని వాటి గురించిన పరిశీలనార్థమైన సమాచారం చూడాలనీ చెపుతుంది.

జడవాదం మార్పు యాంత్రికంగా ఉన్నట్టు చెపుతుంది. అది "చక్రనేమి క్రమంబున" సాగుతుంది అంటుంది. గతితార్కిక పద్ధతి మార్పు అలాంటిది కాదు అని చెపుతుంది. మార్పు చలనం, స్థిరత్వం, అచలత్వం అనేవాటి అర్థం వేరు

అంటుంది గతితర్కం. స్థిరత్వం, అచలత్వం అంటే ఏ మార్పు, కదలిక లేకుండా ఉండడం కావచ్చు. కాని మార్పు, చలనం అనేవి సమానార్థద్యోతక శబ్దాలు కావు. ఓ రాయి కింద పడింది, రైలు నడుస్తోంది అనుకోండి. ఇవి రెండూ చలనంలో ఉన్నట్టు. మార్పు అంటే ఓ రూపం నుంచి ఇంకో రూపానికి మారడం. ఓ చెట్టు ఆకులు రాలిపోయేయి. అంటే చెట్టులో మార్పు వచ్చిందన్నమాట. జుట్టు నెరిసిపోయింది, అంటే రూపం మారిందన్నమాట. "పంతుల్లాగ మీసం ఉంచుకుని రంగు వేసుకుంటే తిరిగి యవ్వనం వస్తుంద"ని లుబ్ధావధాన్లు ఆశపడతాడు. అంత మాత్రానే యౌవనం వస్తుందా? పైకి కనిపించే రూపంలో కొంత మార్పు రావచ్చంతే. మార్పు అంటే రూపం మారడమే కాదు, స్థితిలో కూడ మార్పు రావడం. గంగనీళ్ళు కలుషితం అయాయంటే స్థితి మారిందన్నమాట. అంచేత చలనం అంటే స్థానం మారడం, మార్పు అంటే స్థితి రూపాలు వేరుగా ఉండడం. ఇది కూడా గతితార్కిక పద్ధతి ప్రకారం సంక్షిప్తంగా, పైకి యెదుగుతూ సాగే మార్పు అని, చలనం అన్నీ కింది నుంచి హెచ్చుస్థాయికి సాగే అభివృద్ధి అనీ.

జడవాదం ప్రకారం వైరుధ్యాలు కలిసి వుండవు. కాని వైరుధ్యాలు కలిసి వుండడమే కాదు. ఒకటి రెండో దానికి అవసరం అని గతితార్కిక పద్ధతి చెపుతుంది. వైరుధ్య భరితమైనవి ఒకదాన్ని ఒకటి కొట్టేసుకునేటట్టు వుండవు; ఒకటి లేకపోతే రెండోది వుండదన్నట్టు ఉంటాయి. అలా కాకపోతే వాటిలో ఏదీ వుండదు అంటుంది గతితర్కం. దీన్నే ధ్రువాభి ముఖ్యత అంటుంది. ఈ పదాన్ని ఇంతకు ముందే వాడాం. ఈ వైరుధ్యం వస్తువులలో అంతర్గతంగా ఉంది, ప్రకృతిలో వుంది, ప్రాణికోటిలో ఉంది. ఈ వైరుధ్యాల సంఘర్షణ వల్లనే బోధన, పురోగతి ఉంటున్నాయి. జీవితం జీవితమే, మృత్యువు మృత్యువే అనేవి జడవాదంలో ఒకదాన్ని ఒకటి పరిహరించుకునే విరోధాలు, అవి కలిసి ఉండలేవు. కాని చిత్రం! "ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివాంచ" అన్నాడు భర్తృహరి. ఆయువు చిల్లు కుండలో నీటిలాగా తరిగిపోతూ ఉంటుంది. జీవితం, మృత్యువు కలిసే ఉంటుంది. జితేంద్రియుడు అంటారు మనవాళ్ళు. ఇంద్రియాలని జయించినవాడు, ఇంద్రియ కామనలనేవి ఉన్నప్పుడు కదా జయించడం, జయించక పోవడం! అసలు కామమే లేనివాడు జడుడు! అంచేత వైరుధ్యాలు కలిసి వుంటాయి. జడవాదం వేర్పాటు చూస్తుంది. ప్రతిస్పర్థించేటట్లు పెడుతుంది. గతితర్కం, అలాకాక వైరుధ్యాలుఒకదాంట్లోనే కలిసి ఉన్నాయని అంటుంది. గుడ్డు పొదిగినప్పుడు పగిలి పిల్ల వస్తుంది. గింజ పగిలి మొలక వస్తుంది. నశింపు, పుట్టుక ఒకదాంట్లోనే ఉన్నాయి.

జడవాదం వస్తువుల్ని దేశకాలమాన పరిస్థితులనుంచి విడదీసి సర్వకాల సర్వావస్థల్లోనూ ఒక్కలాగే ఉంటాయన్నట్టు చెపుతుంది గతితార్కిక పద్ధతి. అలా

కాక యేదీ అపరిమేయంగా వుండదనీ, ప్రతిదీ దేశ కాలమాన పరిస్థితులకి లోబడి ఉంటుందనీ చెపుతుంది. అంచేత యేదీ ఆది మధ్యాంతరహితంగా ఉండదు. ప్రతి దానికీ పుట్టుక, పెరుగుదల, నశింపు వుంటాయి. అందుకని ప్రతిదానికీ చరిత్ర ఉంటుంది. యాంత్రికంగా పునరావృతం కావు.

జడవాద పద్ధతి వల్ల ప్రపంచంలో జరిగే పరిణామాలని సరైన రీతిలో అర్థం చేసుకోలేం. ఎలా అంటే చెట్టు ముందా, విత్తు ముందా అని అడిగేవాడు ఏదో ఒకటి ముందు వుండాలి కదా అన్న నిర్ణయానికి వస్తాడు. అలా సూత్రబద్ధం చేసుకున్నాక అన్నిట్నీ అదే దృష్టి కోణంలో చూస్తాడు. అపుడు ఇది యింతే మారదు, మార్చలేం అని తీర్మానించుకుంటాడు. దానికి సమాధానపడిపోతాడు. కాని జీవితంలో అలా సూత్రబద్ధ నియమాలకి లొంగదు. ప్రకృతి అలా లేదు. ప్రపంచం అలా లేదు. ఒకప్పుడు న్యాయం, ధర్మం అనుకున్నవి ఇవాళ అలా లేవు. ఒకప్పుడు అనుల్లంఘనీయం అనుకున్నవి ఇవాళ అలా లేవు. ఇవాళ ఉన్నవి రేపు ఉండక పోవచ్చు. దానికి సమాధానం చెప్పడం యెలా? చెట్టూ ముందే, విత్తూ ముందే అని రెండూ ముందే ఉంటాయన్న సమాధానం లోకజ్ఞాన సమర్థనకి నిలుస్తుందా?

ప్రకృతి గురించి, లేదా మానవ చరిత్ర గురించి లేదా మన బౌద్ధిక కార్యకలాపాల గురించి చూస్తే మనకి కనిపించే మొదటి దృశ్యం వాటిమధ్య సంబంధాలు, ప్రతిచర్యలు కలిసిన అనంత పద్మవ్యూహం. ఇక్కడ యేదీ అదేలా, అక్కడే, అలానే వుండదు. "ప్రతీదీ మారుతూ వుంటుంది, కదుల్తూ వుంటుంది, అస్తిత్వం సంతరించుకుంటుంది, మనుగడనుంచి పోతుంది" అన్నాడు ఏంగెల్స్.

అంటే యేమిటన్న మాట ? యేది ముందు, అదా యిదా ? అనే ప్రశ్నకి వీలే లేదు. ఒకప్పుడు అదీ లేదు, యిదీ లేదు. పరిణామక్రమంలో అది వచ్చింది, యిదీ వచ్చింది. పరస్పర ప్రతిచర్యలలో యివి వచ్చాయి. తర్వాత యిదీ మారవచ్చు.

అంచేత గతితార్కిక పద్ధతి అంటే ప్రతిదాన్నీ దాని దేశ కాల పరిస్థితుల నేపధ్యంలో, దాని చలనశీలతలో అధ్యయనం చెయ్యడం అన్నమాట. దేన్నైనా పరిశీలించాలన్నా, శోధించాలన్నా వీటన్నిటినీ దృష్టిలో వుంచుకోవాలి. గతితార్కిక పద్ధతి పరిశీలన సరైంది అంటే అర్థం ఏమిటి? జడవాద పద్ధతిలో మాదిరీవ్యస్తంగా, దేశ కాల అతీతంగా, స్థిరంగా వున్నట్టుచేసే పరిశీలన కాదు అని. యథార్థానికి యేదీ అలానే వుండదు కదా. మనం యెప్పుడూ అలానే వున్నాం అని మనకి అనిపిస్తూ వుంటుంది. సారూప్యతనిబట్టి అలా అనుకుంటున్నాం అంతే. కాని అలానే లేం. మారిపోయాం. పసితనం నుంచి పెరిగి పెద్దవాళ్ళమవుతాం. అప్పుడయినా రోజురోజుకీ "వార్థక్యం" వస్తూనే వుంటుంది.

బౌద్ధగురువైన నాగసేనునికీ, మినాందర్‌కీ జరిగిన సంభాషణలో గతి

తార్కిక మార్పుని ఓపించే ఉదాహరణ వుంది. ఇది "మిళిందపన్హా" అనే గ్రంథంలో వుంది. పుట్టిన మనిషి యథాతథంగా వుంటాడా అని రాజు అడుగుతాడు. అలానూ వుండడు, పూర్తిగానూ మారిపోడు అంటాడు నాగసేనుడు. ఉదాహరణగా "రాజా! నువ్వు వొకప్పుడు శిశువుగానే వున్నావు. పసివాడిగా కిందపడి దొర్లి కేరింతలు కొట్టి ఆడుకుంటూ వుండేవాడివి. కాని ఇవాళ పెద్దవాడివయేవు. ఆ శిశువు నువ్వూ వొకరేనా వేరు వేరా? అని అడుగుతాడు. అందుకు రాజు వేరు వేరు అంటాడు. "వేరయితే తల్లీ తండ్రీ యెవరూ లేకుండా యింతవాడివి అయేవా" అంటాడు. "రోజూ మనలో కొత్తదనం వస్తోంది. అలా అని పూర్తి భిన్నమైన కొత్తదనమూ కాదు. నిరంతర పరిణామం. అభేద్యమైన క్రమపద్ధతి. రెండూ కలిసే వున్నాయి" అని చెపుతాడు. ఇది గతితర్క సూత్రాన్ని గుర్తించిన ధోరణి.

ఇలా నిత్యజీవితంలో మనకి కనిపించే ఉదాహరణలు కోకొల్లలు. సమాజంలో, ప్రకృతిలో యేదీ స్థిరంగా లేనట్టే మన అనుభూతుల్లో, భావనల్లో కూడా వుండవు. "అంత మంచివాడు యింత క్రూరంగా యెలా అయ్యేడు" అని ఒక్కొకళ్ళని చూసి మనకి ఆశ్చర్యం కలుగుతుంది. "కష్టాలండీ బాబూ కష్టాలు. దెబ్బలు తినితిని కటిక గుండెవాడుగా మారేడు" అని జవాబు చెపుతాం. అలానే పెళ్ళయ్యేదాకా వొకలా వుండే వ్యక్తి పెళ్ళయ్యాక మారవచ్చు. "మునుపటి మనిషి అనుకున్నారేమిటి? పెళ్ళయ్యాక చాలా మారిపోయేడు" అని వర్ణిస్తాం.

## గతితార్కిక పద్ధతికంటే జడవాద పద్ధతి ప్రాచుర్యంగా యెందుకుంది?

మరి నిత్య జీవితంలో మనం గతితార్కిక పద్ధతిలో వుంటామా? జడవాద పద్ధతిలో వుంటామా?

మనిషి అజ్ఞానం నుంచి భావవాదం పుట్టినట్టే గతితర్కం గురించిన జ్ఞానం తగినంత లేకపోవడంవల్ల జడవాద ధోరణిలో వుంటాం.

ఇది యెలా జరిగింది? మనిషి ప్రకృతిగురించి తెలుసుకోవడం ఆరంభించాడు. కనిపించినవాటిని విశ్లేషించుకుందుకు వాటి వర్గీకరణ చేసుకున్నాడు. ప్రతిదాన్నీ విడదీసి, యిది యిదీ, అది అదీ అని వేర్పాటుచేసి అధ్యయనం చెయ్యడంలో సౌలభ్యం వుంది. ఆదిలో అన్నీ ఏకమొత్తంగా ప్రకృతి శాస్త్రాలు, భౌతికశాస్త్రాలు అని వ్యవహృతమై అధ్యయనం సాగినా విషయ పరిజ్ఞానం పెరిగేకొద్దీ వర్గీకరణ యింకా సంకుచితం కావాల్సి వచ్చింది. భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, జీవశాస్త్రం, జీవరసాయనశాస్త్రం అంటూ విభజన వచ్చింది. దానితో వాటికవి విడిగా వున్నట్టూ వాటి మధ్య యే సంబంధమూ లేనట్టూ చదవడం మొదలైంది. ఇక ఆయా ప్రత్యేక

శాస్త్రాల్లో యింకా ప్రత్యేక విభాగాలుచేసి ఉష్ణం, కాంతి, శబ్దం అంటూ మరీ 'స్పెషలైజేషన్' పెరిగింది. ఈ స్పెషలైజేషన్ యే మేరకి పోయిందంటే వొక ప్రత్యేక విభాగం అధ్యయనం చేసేవాడు రెండోదాని గురించి తెలుసుకోనవసరం లేకుండా జీవితకాలం ఆ విభాగ పరిశోధనతోనే గడిపెయ్యొచ్చు. స్పెషలైజేషన్ అతిగా పోవడం అన్నమాట. ఓసారి ఒకడు డాక్టరు దగ్గరికి వెళ్ళాట్ట. కన్ను పరీక్షించాలన్నాట్ట. ఏ కన్ను అని అడిగాట్ట డాక్టరు. కుడికన్ను అని చెప్పాట్ట వెళ్ళినవాడు. నేను యెడంకన్ను స్పెషలిస్టుని, కుడికన్ను స్పెషలిస్టు వేరే వున్నాడన్నాట్ట. ఇది అతి స్పెషలైజేషన్ అనర్థం. విడిగా వర్గీకరించుకుని అధ్యయనం చెయ్యడంలో లాభం వుంది, క్షుణ్ణంగా దాన్ని గురించిన అవగాహన యేర్పడుతుంది. కాని నష్టం యెక్కడ అంటే యీ వేర్పాటు, వర్గీకరణ జడవాద ఆలోచనలో, దేనికది వేర్పాటుగా వున్నాయి అనే భావన కలిగిస్తాయి. అందుకనే తమ తమ విజ్ఞానక్షేత్రాల్లో అందెవేసిన చేతులైన మహామహులెందరో అనేక యితర విషయాలకి సంబంధించి వెలితిగా వుంటారు. అమెరికాలాంటి దేశాల్లో మహా మహా శాస్త్రవేత్తల రాజకీయ పరిజ్ఞానం అరకొరగా వుండడానికి కారణం అది తమకి సంబంధించింది కాదు అనుకోవడమే.

అంచేత ఈ వర్గీకరణ, విభజన అధ్యయన సౌలభ్యం కోసమేనన్న స్పృహ మరపున పడకూడదు. వస్తువుల్ని వాటివాటి స్థితిరూపంలో, చలనంలేని రూపంలో చూసే గ్రహించే అలవాటు మనకి ఏర్పడ్డంవల్ల వాటి మధ్య సంబంధమేమిటి, సమగ్ర అవగాహన ఎలా రావాలి అన్న దృష్టి వుండదు. వస్తువుల మధ్య వున్న సంబంధాల్ని ఉపేక్షిస్తాం. వాటి మధ్య ఉమ్మడిగా యేమీ వుండదని అనిపిస్తుంది. ఇది ఫోటోగ్రఫీలాగా అనుకోండి. మామూలు ఫోటోగ్రఫీలో బొమ్మలు కదలని స్థితిలో వుంటాయి. సినిమా ఫోటోగ్రఫీలో కదులుతూ వుంటాయి. కదలని స్థితిలో బొమ్మలు తీసి (మామూలు) తర్వాత కదిలేస్థితిలో (సినిమా ఫోటోగ్రఫీ) చూస్తాం. జడవాదంలో వేర్పాటు చేసి నిశ్చలస్థితిలో చేసిన పరిశీలన గతితార్కిక అవగాహనకి పిండిగా వాడుకోవాలంతే. ఫోటోగ్రఫీ ఉదాహరణని శాస్త్ర విజ్ఞానాలకి మానవ మస్తిష్కానికీ అన్వయించవచ్చు. మనం వస్తువుల్ని స్థిరంగా వున్నస్థితిలో, అంటే కదిలే స్థితిలో కంటే ముందు అధ్యయనం చేస్తాం.

ఇది ఓ రకంగా అవసరమే. గతితార్కిక పద్ధతిలో కూడా ఒక దశలో స్థిరంగా వున్నరూపంలో వస్తువుల్ని అధ్యయనం చెయ్యడం అవసరం కాని అది కొరవవున్న అధ్యయనమే, ఖండదశ మాత్రమే. దీన్ని వస్తువుల మార్పు సంబంధాలతో సమ్మేళనం చెయ్యాలి. అప్పుడే అది పరిపూర్ణ పరిశీలన అవుతుంది.

కాని జడవాద పద్ధతి దృష్టి ఎందుకు ప్రాచుర్యంగా వుంది? నిత్యజీవితంలో

పెత్తనం చెలాయిస్తూ వుంది? ఎందుకంటే తాత్కాలిక స్థితిని, దశలని ప్రస్తావించుకునేటప్పుడు ఇది నిత్యజీవితానుభవాల ప్రతిఫలనంగా వుండడమే. అంతేకాదు, నిత్య జీవిత వ్యవహారంలోని భాషలో పదబంధాలు ఓ స్థిరత్వ భావనని వ్యక్తం చేస్తున్నాయి కాబట్టే "ఆఫీసరు మంచివాడేనా?" "ఆఁ దేముడు" అన్నామనుకోండి. ఒక భావసముదాయం మనకి తోస్తుంది. ఆ పదంవల్ల కొన్ని సుగుణ, ధార్మిక, దయా స్వభావ అంశాలే మనకు తడతాయి. రాక్షసుడు అన్నామనుకోండి, కొన్ని చెడ్డ క్రూర అమానుష అంశాలు తడతాయి. ఇక్కడ ఆ ఫలానా వ్యక్తి ఎప్పుడు దేముడుగానే వుంటాడా. సందర్భాన్నిబట్టి మరోలా వుంటాడా అనే మీమాంస చెయ్యం. సుమారుగా ఓ భావన తడుతుంది. దేముడు అన్నా, రాక్షసుడు అన్నా మొత్తం మీద ఆ భావన సమాహారం అందుతుంది. కాని అదే దేముడు మరోచోట, మాటకి పెళ్ళాం పిల్లల దగ్గర క్రూరంగా ఉండచ్చు, పై అధికార్ల దగ్గర బానిసగా ఉండచ్చు. ఇవన్నీ మనం పొరలు ఒలుస్తూ కూర్చుని నిత్యజీవిత పదజాలంలో వ్యక్తం చెయ్యం. అంచేత నిత్యజీవితంలో, ఆలోచనా విధానంలో జడవాద పద్ధతి ప్రాచుర్యంగా కనిపిస్తుంది.

అంతేకాదు భౌతికవాదం పద్దెనిమిదవ శతాబ్దంలో యాంత్రిక భౌతికవాదంగా ఉండేది. ఎందుకని? ఆనాటికి అభివృద్ధి చెందిన శాస్త్రాలకి భౌతికవాద భావన జోడించడంవల్ల, ఆనాడు యంత్ర విజ్ఞానశాస్త్రం బాగా అభివృద్ధి చెందింది- మామూలు భాషలో యంత్రాల గురించిన అధ్యయనం. కాని శాస్త్ర పరిభాషలో దేన్నైనా తప్పించి వచ్చే కదలిక. యాంత్రిక కదలిక అతి సాదా కదలిక కాబట్టి ఈ శాస్త్రం మొదట అభివృద్ధి చెందింది. చెట్టు నుంచి రాలిపడే పండుని గురించి అధ్యయనం చెయ్యడం తేలిక, పండుని అది పండడానికి అవసరం అయిన మార్పుల్ని గురించి అధ్యయనం చెయ్యడంకంటే. పండు పక్వానికి రావడానికి పడే పాట్లు కంటే రాలిపడ్డం, దానిమీద గాలి ప్రభావం పరిశీలించడం కంటికి కనిపించే దాన్ని చూసి పరిశీలించడమే కదా. ఇది సులభం. కాని పండుకావడానికి దాని లోపల జరిగే మార్పులు కంటికి కనిపించవు. అంచేత దాని గతితార్కిక మార్పు అధ్యయనం చెయ్యడం కష్టం. కాని పైపై పరిశీలన పాక్షికమైందే కదా. అలాంటి పరిశీలన యంత్రవతుగా వుంటుంది. ఇది జడవాద పద్ధతికి ఆస్కారం కలిగిస్తుంది.

భౌతికవాదం శాస్త్ర విజ్ఞానంమీద ఆధారపడి వృద్ధి చెందుతుందనే విషయం మనకి తెలుసు. అందుకనే ఆదిమ భౌతికవాదం ముతకగా వుండేది. పద్దెనిమిదవ శతాబ్దంలో యంత్ర విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందడంవల్ల తదనుగుణంగానే జడవాదం వుండేది.

కాని ఈ యాంత్రిక జడపద్ధతి భౌతికవాదాన్ని భౌతికవాదం అనే అంటు

న్నారు. ఎందుకని? తత్వశాస్త్ర మౌలిక ప్రశ్నకి సంబంధించి పదార్థమే ప్రాథమికం అంటుంది కనక. కాని జడవాద పద్ధతి ఎందుకయిందీ అంటే ఈ విశ్వం సంక్లిష్టంగా వుండే అనేక వస్తువుల సమాహారం అనీ, దేనికదే విడివిడిగా స్థిరంగా, యంత్రంలో సీలల మాదిరీ చక్రాల మాదిరీ వుంటుందని భావించడంవల్ల.

పంధొమ్మిదవ శతాబ్దం నాటికి శాస్త్రవిజ్ఞానం మరింత పరిఢవిల్లింది. శాస్త్రాల మధ్య వున్న అంతస్సంబంధం స్పష్టంగా తెలిసింది. చలన రహిత స్థిరత్వం, సంబంధంలేని భిన్నత్వంలేవు అని తెలిసింది. దాంతో అన్నిట్నీ సమాలోకనం చేసి పరిశీలించే వైఖరి అవసరం అయింది. జడవాద పద్ధతి తర్కం వెనకడుగు వేసింది. సమగ్రంగా పరిశీలించే పద్ధతి వచ్చింది. దాన్ని గతితర్క పద్ధతి అన్నారు. ఈ పద్ధతిలో ఆలోచించి, విశ్లేషణ చేసే భౌతికవాదశాఖని గతితార్కిక భౌతికవాదం అన్నారు.

గతితార్కిక భౌతికవాదం వస్తువుల గురించీ, ప్రకృతి గురించీ, మనిషి గురించీ, సమాజం గురించీ నిర్దిష్టంగా పరిశీలిస్తుంది. సరి అయిన అవగాహనని ఇస్తుంది. రుజువైన ఆచరణ ఏర్పడుతుంది.

కాని గతితార్కిక పద్ధతి అధ్యయనం కష్టంలా కనిపిస్తుందే అనిపించవచ్చు. స్థిరంగా వున్న స్థితిలో వస్తువుల గురించి అధ్యయనం చెయ్యడం తేలిక, కదిలేవాటి గురించి కంటే. ఎగిరేపిట్టని కొట్టడం కష్టం. ఇది మామూలు విషయమే. మనిషికి ముతకపన్లు చెయ్యడం తేలిక. సున్నితమైన పన్లు చెయ్యడం కష్టం. ఒకదాని మీద ఒకటిగా ఇటుకలు పెట్టడం క్రేన్‌తో పని చెయ్యడంకంటే తేలిక అనిపిస్తుంది. క్రేన్‌తో పనికి నైపుణ్యం కావాలి. అంచేత కష్టం అనిపిస్తుంది. కాని అలవాటు పడినవాడికి క్రేన్‌తో పనిచాలా తేలికగా కనిపిస్తుంది. అభ్యాసం కూసు విద్య అనడం అందుకనే. గతితార్కిక పద్ధతి కూడా అంతే. జడవాద పద్ధతి ఇటికల పేర్పు ఆలోచన, ముతకపని పద్ధతి. దీన్నుంచి తప్పించుకుని గతితార్కిక పద్ధతి ఆలోచనని మన ఆయుధంగా చేసుకుంటే సమగ్ర బోధన వస్తుంది.

అంటే గతితార్కిక పద్ధతి ఆలోచన జడవాద పద్ధతికంటే లాభసాటిగా వుంది కాబట్టి, వుంటుంది కాబట్టి ఆ ఆలోచనా పద్ధతిని అవలంబించమనడం కాదు. ఏదో సౌకర్యం వుండబట్టి అని కాదు. సమగ్ర అవగాహన అందే లాభం, సౌకర్యం లేకపోలేదు. కాని గతితర్కం, గతితార్కిక పద్ధతి జీవితంలో వున్నదే, మనకి తెలియకుండా అమలులో వున్నదే. ఇది ఏదో దివ్యజ్ఞానంలాగా ఆవిష్కృతమైనటు వంటిది కాదు. ప్రకృతిలో స్వతస్సిద్ధంగా వున్నదే, బుర్రల్లో అల్లుకుని బయట పెట్టింది కాదు.

"స్వతస్సిద్ధంగా వున్నప్పుడు, దానంతట అదే అమలు జరిగేటప్పుడు యిక దాన్ని గురించి అధ్యయనం చెయ్యడం యెందుకు. లేబరేటరీలో ప్రయోగం చేసినట్టు

వాడడం యెందుకు అనిపించవచ్చు. గతితర్కం సమస్యల్ని తనంతట తానే పరిష్కరించే సూత్రం కాదు. సమస్యల్ని పరిష్కరించనూ పరిష్కరించదు. కాని సమస్యల పరిష్కారానికి సాయపడుతుంది. గతితర్కం అనే పేరు యేమిటో వినకుండా కూడా. సమస్యల్ని గతితార్కిక పద్ధతిలో పరిష్కరించవచ్చు. కాని గతితార్కిక నియమాల గురించిన అవగాహన, చైతన్యంవుంటే మనముందున్న సమస్యలలోని సూక్ష్మాంశాలు. అంతస్సంబంధాలు, వైరుధ్యాలు, సంక్లిష్టతలు పరిశీలించి పరిష్కరించే పనిముట్టు, మనచేతిలో వున్నట్టన్నమాట. వాస్తవ పరిస్థితిని విశ్లేషించడానికి గతితర్కం అనేది యేదో తెచ్చిపెట్టుకుని అంటుకట్టుకునే పద్ధతికాదు. ఇది వో పథకమూ కాదు. వాస్తవ పరిస్థితిని విశ్లేషించేందుకు యథార్థ విషయాలు యేమిటో? అది యెలా మారింది,యెలా వుంది అని అనేక విషయాలని సేకరించి క్రోడీకరించి తత్సంబంధమైన శ్రమ తప్పించుకునే మార్గమూ కాదు. ఉదాహరణకి లోకంలో పిల్లల పుట్టుక వుంది. సృష్టిలో యిది సకల జంతుజాలంలోనూ వుంది,మనుషుల్లోనూ వుంది. పిల్లల్ని కనడం గురించిన శాస్త్రీయ అవగాహన యేమీలేని రోజుల్లోనూ కన్నారు. ఎప్పటికీ అలాంటి అవగాహన రాని జంతువులూ సంతానోత్పత్తి చేసుకుంటున్నాయి. కాని ఆ అవగాహన అందుకుని మనిషి యేం సాధించాడో ఏ వైద్యశాస్త్ర విద్యార్థి అయినా చెప్పగలడు. అంతమాత్రంచేత ఆ అవగాహన అందించినంత మాత్రంచేత పిల్లల్ని కనడం పూర్వంలాగా లేదా ? అది మనకి తెలియనప్పుడూ అలానే వుంది, తెలిశాక అలానే వుంటుంది. కాని తెలిశాక ప్రమాదాలు, ఆందోళనలు తగ్గించుకునే మార్గం వచ్చింది. అంతేకాని విషయం తెలుసుకున్నాం కదా అని ప్రసవాలు మారిపోలేదు. ప్రసవ ప్రమాదాలు, ప్రసూతి మరణాలు, బాలారిష్టాలు తగ్గేయి. అంచేత గతితార్కిక ప్రధానంగా పదార్థంతో వ్యవహరించే పద్ధతి. అంటే యే నిర్దిష్ట, అనుభవధార విషయంతోనైనాగానీ వ్యవహరించే పద్ధతి.

గ్రీకు తత్త్వవేత్త హెరాక్లిటస్ పరిశీలనగురించి ప్రస్తావించుకున్నాం. నదిలో నీళ్ళు పారుతూ వుంటాయి, కాబట్టి ఒకే నదిలో రెండుసార్లు స్నానం చెయ్యలేం అని హెరాక్లిటస్ అన్నాడు. అది ప్రాథమిక గతితర్క పరిశీలన. గ్రీకులు ప్రకృతిలో కదలిక, చలనం ప్రతిచోటా చూసి ఆశ్చర్యపోయేరు. హెరాక్లిటస్ని గతితర్క పితామహుడని పిలిచేవారు. మిళిందపన్హా ఉదాహరణవల్ల బౌద్ధంలో గతితర్కం ఎలా వుందీ తెలిసింది.

ప్రకృతిలో యింత సహజంగా, అనివార్యంగా వున్న గతితర్కం ఆలోచనా ధోరణిలో తన యేలుబడిని అప్పుడే ఎందుకు స్థాపించుకోలేకపోయింది ? అని అడగవచ్చు. పదార్థం గురించిన విజ్ఞానంగాని, దాని గురించిన శాస్త్రీయ అవగాహన గాని పరిణతి చెందనంతకాలం ఆలోచనాసరళికి గతితర్క పద్ధతి పట్టలేదు. ఆ

మార్పు వచ్చినప్పుడు ప్రకృతిలో వున్న గతితర్కం ఆలోచనా ఆయుధంగా మారింది. సర్వ సమగ్ర పరిశీలన సత్యసమన్వితంగా వుండే విషయ పరిజ్ఞానం మనకి అందేయి. ఇది సత్య సమన్వితమైందనీ, సమగ్రమైందనీ ఎలా చెప్పగలం ? జడవాదంలో అమూర్త ఆలోచనా ధోరణి వుందని చూశాం కదా. అమూర్త అంటే రూప నిర్దిష్టంగానిది అని. దీన్నే తాత్విక పరిభాషలో అనిర్దిష్ట, అపరిమేయ అనీ వాడుతూ వుంటారు. అమూర్త ఆలోచనలో వస్తువుల్ని, వాటి ధర్మాల నుంచి అమూర్తం చేసి, అంటే వాటి గుణ రూప ధర్మాల నుంచి విడదీసి, భావన చెయ్యడం వుంటుంది. భావనలకి సంబంధించి అది తప్పకపోవచ్చు. మనిషిని రెండుకాళ్ళ జంతువు అంటారనుకోండి. ఇక్కడ మనిషికి వున్న యితర అంశాలని తల, చేతులు వుండడం నుంచి అమూర్తం చెయ్యడం జరిగింది. అలాగే మానవుడు అని సంఖ్యానేక మానవుల విడివిడి ప్రత్యేకతల్ని అమూర్తం చేసి సామాన్య ధర్మాన్ని చూస్తున్నాం. ఆలోచన ఈ మాదిరీ వుండడం సహజం. కాని చిక్కు ఎక్కడంటే ఈ అమూర్తభావన పాదుకుని రూపసాదృశ్యంరీత్యా అమూర్తంగానే ఆలోచనలో నిలబడుతుంది. దానివల్ల కలిగే ఆటంకమే సరి ఆలోచనా ధోరణి లేకపోవడం. దాన్ని తొలగించుకుని అమూర్తంగా కాక నిర్దిష్ట మూర్త రూపంలో వస్తువుల పరిశీలన చెయ్యడం సరి అయిన పద్ధతి. ఉదాహరణకి మేధావులందరిదీ బట్టతలే. నెహ్రూ గారిదీ బట్టతలే. నాదీ బట్టతలే కాబట్టి నేనూ మేధావినే అని ఎవడయినా 'లాజిక్' చేస్తే ఎలా వుంటుంది ? బట్టతల సారూప్యమే తప్ప బుద్ధి సారూప్యంలేదని తెలుతుంది. అలాగే "మానవ స్వభావం" అన్నామనుకోండి. సర్వకాల సర్వావస్థలకీ ఒక్కలాగే వుంటుందన్న అమూర్త భావం మనకి కలుగుతుంది. కాని మానవ స్వభావం యేకరీతిగానే వుండదు. మనుషులు వున్న పరిస్థితుల్నిబట్టి కాలాన్నిబట్టి ఉంటుంది. ఆధునికయుగంలో జీన్స్ పరిశోధన విస్తారం అయ్యాక వంశపారంపర్య లక్షణాలు వగైరా వగైరా ఎన్నో అంశాలు పరిశీలనకి వచ్చి చేరాయి.

మనుషుల స్వభావంలో మార్పు కాలగతిలో ఎలా వచ్చిందో అనేక దాఖలాలు కనిపిస్తాయి. నీతి నియమాలపట్ల ఆచార వ్యవహారాలపట్ల యింకా నిత్య జీవిత ఆదర్శాలకి సంబంధించి, యింకా అనేక విషయాలకి సంబంధించి మానవ స్వభావంలో మార్పు ఎలా వచ్చిందీ వందయేళ్ళనాటికీ ఈనాటికీ తేడా చూస్తే తెలుస్తుంది. వందయేళ్ళదాకా అక్కర్లేదు, గట్టిగా పాతిక ఇరవైయేళ్ళు చూస్తే చాలు. "నాకిప్పుడరవై అయిదో ఏడు జరుగుతున్నదనుకో. వెనక్కి తిరిగి చూసుకుంటే ఎన్నో జన్మలు గడిచినట్టనిపిస్తుంది. ఒకదానికీ యింకోదానికీ సంబంధం లేదు. నేను పుట్టిననాటికి ఈ ప్రాంతాల రైలు కూడా లేదు. కార్లులేవు. బస్సులు లేవు. ఇవాళ చెవుల్లో రేడియోల మోతా, నెత్తిన విమానాల మోతా,

సినిమాలూ, రేపు ఆకాశంలో మనుషులు విహరిస్తారనుకుంటున్నారు. రజస్వల అయిన పిల్లలకి పెళ్ళిళ్ళు చేస్తున్నారు. ప్రపంచంలో ఎన్నో మార్పులు, ధర్మంలో ఎన్నో మార్పులు.... ఆంజనేయులుగారు ఓ విధమైన స్వగతం చదివేడు (కొడవటిగంటి కుటుంబరావుగారి "అనుభవం" నవల). రజస్వల అయిన పిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యడం అప్పట్లో ఎలాంటి సాహసకృత్యమో చూడండి! వితంతువులకి ముండనం చేయించడం ఇవాళ ఎంతో క్రూరంగా కనిపించే విషయం. మరికొంత కాలంపోతే అసలు చరిత్ర పుస్తకాల్లో చదువుకోవాల్సిన విషయంగానే మిగిలి పోతుంది. స్త్రీ విద్య అవసరమా అనవసరమా అనే చర్చ ఒకప్పుడు జోరుగా వుండేది. అసలీ చర్చ ఏమిటని ఇవాళ నవ్వుతారు! ఆచార వ్యవహారాలకీ ధర్మాలకీ సంబంధించిన మార్పే కాదు, అంతరంగంలో మార్పులూ చాలా వచ్చేయి. మనుషుల అనుభూతులూ మారుతాయి. ఒకప్పుడు ప్రేమ కనిపించినచోట విపరీతమైన పగ రావచ్చు. అది వింత కాదు.

ఇప్పటికి లోకంలో చూడండి "మంచికి రోజులు కావండీ బాబూ, మోసం, వంచన వుంటే తప్ప నెగ్గుకురాలేం. మనకి అవి చేతకావు. అంచేత ఇలా ఉన్నాం." అనేలాంటి మాటలు వినిపిస్తాయి. వీటి వెనక ఓ సూచన ఉంది. ప్రస్తుతం ఉన్న సాంఘిక వ్యవస్థలు అర్థం లేనివైనట్టు కనిపించడమే. అంటే సర్వకాల సర్వావస్థలకీ అదే స్థిరమైన మంచి చెడ్డలు లేవనేకదా. ఉన్నాయని భావించడం తప్పు. మారుతున్నాయి అని వాటి కాలమాన పరిస్థితుల దృష్ట్యా చూడడం సక్రమ ఆలోచన.

అంచేత గతితార్కిక పద్ధతి ఆలోచనా విధానం సహేతుకమైంది, సరైంది, సత్యపథ నిర్దేశకమైంది.

కాని జడవాద పద్ధతి భౌతిక వాదం నుంచి గతితార్కిక పద్ధతి మార్పు ఎలా జరిగింది?

ఆ:, ఏం వుంది. 18వ శతాబ్దంలో భౌతికవాద చింతన జడవాద ధోరణిలో ఉండేది. తర్వాత శాస్త్రవిజ్ఞానం పెరిగింది. మార్పులు వచ్చేయి. అప్పుడు మార్క్స్, ఏంగిల్స్‌లు వచ్చేరు. జడవాద ధోరణిని ఖండించేసి గతితర్కాన్ని భౌతిక వాదానికి జోడించారు అని జవాబు చెపితే గనక జడవాద చింతన కంటే ఇంకా ఘోరంగా ఆలోచనా పరిధిలో పప్పులో కాలేస్తాం. మార్క్స్, ఏంగిల్స్‌లు గతితార్కిక సూత్రాలని ఆవిష్కరించి చూపించేరు. మార్క్స్, ఏంగెల్స్ కంటే ముందే జర్మన్ కార్మికుడు జోసెఫ్ డీట్స్‌గెన్ ఆ వి ష్క రిం చే డు. "మానవ మేధో కృషి స్వభావం-ఒక శ్రమజీవి వర్ణన" అనే పుస్తకం రాసేడు. ఆలోచనకి సంబంధించి "అత్యుత్తమమైన పనిముట్టుగా, అతి నిశితమైన ఆయుధంగా ఉపయోగపడే" భౌతిక వాద గతితర్కం "వాస్తవ ప్రపంచంలోని గతితర్కపు ప్రతిబింబం మాత్రమే." సాంఘిక జీవితం వికసించి జడవాద పద్ధతి చింతనలో ప్రకృతి గురించీ, సమాజాన్ని

గురించీ సమగ్రంగా సర్వగ్రాసిగా అర్థం చేసుకోవడం వెలితి అయింది. సమగ్రంగా, సర్వగ్రాసిగా అర్థం చేసుకోవడానికి యే సూత్రాలు ఆయుధంగా పని చేస్తాయి అన్న శోధన ఫలితమే వాస్తవ ప్రపంచంలోని గతితర్కం భావనల్లో ప్రతిబింబించడం. ఆ సూత్రాలని ఆవిష్కరించుకున్నాక వాటిని జడవాద పద్ధతి చింతనలో బిగించి అన్వయించడమే ఇవాళ తప్పిదాలకి హేతువు. "సోవియట్ యూనియన్ కార్మికుల రాజ్యం (కనీసం అలా అని ప్రపంచ వ్యాప్తంగా డెబ్బై యేళ్ళుగా నమ్మేరు) కార్మికుల రాజ్యంలో సమ్మెలుండరాదు. రాజ్యం వాళ్ళదే అయినప్పుడు వాళ్ళు సమ్మెలు ఎవరికి వ్యతిరేకంగా చేస్తారు?" అనే వాదన వినిపిస్తోంది. కాని యథార్థానికి సమ్మెలు జరుగుతున్నాయి కదా? దీనిని ఎలా విశ్లేషించడం? ఈ సిద్ధాంతమే తప్పు అన్న శంకలు కలుగుతున్నాయి. జడవాద పద్ధతి ఆలోచనా ఫలితం ఇది. సమాజం సజీవమైంది. నిరంతరం మార్పులు చెందుతుంది. ఇలా చూడకుండా మూస పద్ధతిలో సిద్ధాంతాన్ని అంటకట్టబోతే తప్పులు జరగక మానవు. మతంలో చెప్పిన సూక్తుల్ని కంఠస్థం చేసి వల్లించి నమ్మినట్టే సజీవ సూత్రాన్ని జడం చేసి అన్వయించడంవల్ల తప్పులు జరగక మానవు. సమాజ అభివృద్ధిని వివరిస్తూ మార్క్స్, ఏంగెల్స్‌లు రూపొందించిన సామాన్య సూత్రాల్ని బైబిల్ ప్రవచనాల్లా, భగవద్గీత బోధల్లా అర్థం చేసుకోవడంవల్ల తప్పులు జరిగేయి. మతంలో మాదిరి మాటకి ప్రాధాన్యం ఇచ్చి దాని అంతస్సారం యేమిటో గ్రహించకపోవడంవల్లి తప్పులు జరిగేయి. శృతి, స్మృతి ప్రమాణాలని గ్రహించినట్టుగా గ్రహించడం వల్ల తప్పులు జరిగేయి. వేదం వుంది, భారతం వుంది. భారతం పంచమ వేదం అని ఆ లం కా రి క ం గా అ న్నా వేద ప్రా మా ణ్యం భా ర తా ని కి లేదు. వేదంలో ఉపపాదితమైన వస్తువుకే కాక శబ్దానికీ అధిక ప్రాముఖ్యం వుంది. ఏ ఒక్క శబ్దాన్నీ తొలిగించి దాని స్థానంలో పెట్టడానికి లేదు. "అగ్నిమీళే" లాంటి చోట్ల అగ్నికి బదులు సమానార్థకమైన వహ్ని వుంచినా అర్థ భేదం గాని, ఛందో భంగం కాని కలగవు. కాని వేదత్వం భంగమవుతుంది. కాబట్టి వేదాలు శబ్ద ప్రమాణాలు అయేయి. (చూడండి : భారతము-తిక్కన రచన, భూపతి లక్ష్మీ నారాయణ రావు) అందుకనే మన దేశంలో అనతి క్రమణీయమైన దాన్ని, అనుల్లంఘనీయమైన దాన్ని "వేదవాక్కు" అని వ్యవహరిస్తాం. ఈ మాదిరి ప్రామాణ్యం శిరోధార్యం చేసుకోవడంవల్లనే గతితార్కిక పద్ధతి చింతన వెనకబట్టి జడవాద ధోరణిలో మార్క్సిస్టు సిద్ధాంతాన్నికూడా ఆచరణలో అనువర్తింపచేసి ఈ సిద్ధాంతం తప్పేమో ననే సిద్ధాంతాలకి తావు కలిగిస్తోంది. "వేదప్రామాణ్యం" వెనకబడిన దేశాల్లోనే ఉంటుంది. అదే పరిస్థితి మార్క్సిస్టు సిద్ధాంతానికి సంభవించింది.

ఈ శతాబ్ది ఆరంభంలో అన్నిటినీ ప్రశ్నించే ఆలోచనాధోరణి వెల్లివిరిసింది. అన్నిటినీ నిలదీసి నిగ్గుతేల్చి సత్య సమన్వితంగా భాసించే సిద్ధాంత పునాది కలది

మార్క్సిజం. కాని ఇవ్వాళ "అర్తడాక్స్ మార్క్సిజం" లాంటి ప్రయోగాలు, పిడి వాద ధోరణిలాంటి విశేషణలు వచ్చేయంటే కారణం గతితార్కిక పద్ధతిలో కాక జడవాద పద్ధతిలో ఈ సిద్ధాంతాన్ని అన్వయించడమే. అన్ని 'అర్తడాక్స్' లనీ (ఛాందసాలని, మూఢ సంప్రదాయాలని) తునాతునకలు చేసే సిద్ధాంతానికి ఇది అప్రథ.

అంచేత, గతితార్కిక పద్ధతిని అధ్యయనం చెయ్యడం ఇవ్వాళ మరింత అవసరం.

ఈ గతితార్కిక పద్ధతి ఏమిటో చూశాం. దీని సూత్రాలు ఏమిటి? ఈ ధోరణిలో ఆలోచనకి మార్గనిర్దేశక నియమాలు ఏమిటో తెలుసుకుంటే

"ఇప్పుడులో జీవిస్తూ మనం
ఈ నౌకను పట్టిన తుప్పును విదిలించి
పడవచెక్కలకి అంటుకున్న
సున్నపు గుల్లలు డుల్లించి
తుప్పు వదిలించి తుపానులను జయించి లంగరుని సూర్యకాంతి సమీపంగా దించగలం. అంచేత ఆ సూత్రాలు ఏమిటో చూద్దాం.

## గతితర్క నియమాలు

వస్తువులని పరిశీలించే పద్ధతిలో గతితర్కానికీ, జడవాదానికీ వుండే భేదం ఏమిటో స్థూలంగా చూశాం. జడవాద ధోరణి లక్షణాలు ఏమిటో చూశాం. గతితర్కానికి దాని నియమాలు ఉండాలి కదా. జడవాదంలో సామాన్య తర్కం, దాని మీద ఆధారపడ్డ సూత్రీకరణలు ఉంటాయి. ఉదాహరణ ఇది వరకే చూసినట్టు 'మనుషులు మరణిస్తారు, నాయకులు మనుషులు, నాయకులూ మరణిస్తారు' లాంటి తర్కం. అలాగే జడవాదంలో వస్తువుల స్థిరత్వ గుణం మాత్రమే చూడ్డం వుంది. గతితర్కానికీ దాని తార్కిక సూత్రాలు, చలనం గురించి పరిశీలించడం వుంటాయి.

గతితర్క నియమాలు ఏమిటో చూసే ముందు గతితర్కం అనే పదం అర్థం ఏమిటో చూద్దాం.

మెటఫిజికల్ (Metaphisical) అనే పదానికి నేను జడవాదం అని వాడేను. ఇంతకుముందు తెలుగులో అది భౌతికవాదం అని వాడుక వుంది. ఈ అర్థంలో, అంటే అధి భౌతికవాదం, అనే అర్థం ఒక దశవరకూ సహేతుకంగానే వుంది. దీన్ని గురించి ఇదివరకే వివరణ ఇచ్చేను. అరిస్టాటిల్ శిష్యులు యెలా దాన్ని వర్గీకరించిందీ, దాన్నిబట్టి 'మెటఫిజికల్' అనే మాటని భౌతికమైన దానికి అవల అనే అర్థంలో వాడిందీ చెప్పేను. ఆ అర్థానికి అనుగుణంగా తెలుగులో అధి భౌతికవాదం అని కొంతవరకూ సరిపోయింది. కాని మార్క్స్, ఏంగెల్స్‌లు మెటఫిజికల్ అనే

పదాన్ని వేరే అర్థంలో వాడేరు. ఆ అర్థానికి అధి భౌతికవాదం అనే పదం నప్పదు. గతితర్కం అనే దానికి ప్రతిగా వుండే అర్థంలో 'మెటఫిజికల్' అని వాడేరు. అంచేత నేను 'జడవాదం' అని అర్థద్యోతకంగా వుండే రీతిలో వాడేను. Metaphysical thinkingకి జడవాదం అనడం బాగుంటుందని శ్రీ ఏటుకూరు బలరామ మూర్తిగారు నే వాడిన పదాన్ని ఆమోదించేరు. 'మెటఫిజికల్' అనేదానికి అధిభౌతిక కంటే 'జడవాదం' అనడం అన్వర్థ పదంగా వుంటుంది. అదిగాక "అధిభౌతికవాదం" అనేపదం అంత విస్తృతంగా వాడుకలో లేదు కాబట్టి 'జడవాదం' అనడానికి అభ్యం తరం ఉండకపోవచ్చు.

గతితర్కం అనేది అలా కాకపోవచ్చు. Dialectics అనేదానికి తెలుగులో గతితర్కం అనే అనువాదం వాడుకలోకి చాలాకాలం క్రితమే వచ్చింది.

డయలెగో (Dialego) అనే గ్రీకుపదం నుంచి డయలెక్టిక్స్ (Dialectics) వచ్చింది. Dialektikas / Dialego అంటే వాదించు, చర్చించు అని అర్థం. ప్లేటోకి Dialectics అంటే మొదటగా ఒక భావనలోనో సూత్రంలోనో వున్న మంచి చెడ్డలన్నిట్నీ క్షుణ్ణంగా బయట పడెయ్యడం. రెండవదిగా, పరిశీలించగల విషయాల నుంచి భావనలకి వుండే ఆలోచనా దశలని, వస్తువులలో మారకుండా వుండే అంశాలని చూడ్డం. ఆఖరిగా అన్నిట్లోనూ వున్న మౌలిక భావాన్ని శివం అనే దాన్ని, చూడ్డం. ప్లేటోకి భావనలే వాస్తవికమైనవి కాబట్టి Dialectics సదా భావనల శాస్త్రమే, ఆ శాస్త్రం అయింది. హెగెల్‌కి సంబంధించి భావనలక్రమం, సిద్ధాంతం, పూర్వపక్షం, సమన్వయం అనే దశలలో అమూర్త భావన చేరేదాకా సాగుతుంది. కాని మార్క్స్, ఏంగెల్స్‌లు Dialectics ని కొత్త అర్థంలో చూశారు. వాళ్ళ దృష్టిలో భావాల చలనం కాదు, వైరుధ్యాలలో వస్తువుల చలనం. ఈ చలనాన్ని మనసు చైతన్యయుతంగా ప్రతిఫలిస్తుంది. ఈ రకంగా మార్క్స్, ఏంగెల్స్‌లు Dialectics ని ఆలోచనాసీమలో కొత్తరక్తం ఎక్కించి నిలబెట్టారు.

తెలుగులో Dialectics కి వుత్పత్తి అర్థం యిచ్చే పదం అయితే వేరే వుండాలి, అంటే మరింత అన్వర్థంగా. "తెలుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" అన్నారు తిరుపతి వేంకటకవులు. వ్యాకరణ దీపమే కాదు, పారిభాషిక పద సముదాయ దీపమూ చిన్నదే. Dielectics కి తెలుగులో గతితర్కం అనీ Dialectical meterialism అనే దానికి గతితార్కిక భౌతికవాదం అనీ శ్రీ మహీధర రామమోహనరావు సోదరులు మొదటగా రూపొందించారు. అదే ప్రకాస్తి పొందింది. దానికంటే మరింత అన్వర్థంగా వుండాలని రా. రా. గారు 'పరస్పరవాదం' అని రూపొందించారు. కాని అప్పటికే సుమారు నలభైయేళ్ళుగా గతితర్కం అనే వ్యాప్తిలో వుండడంచేత పరస్పరవాదం అనే పదబంధం

వాడుకలోకి రాలేదు. అయినా పదాల అర్థాన్ని రూఢిలో వున్నదాన్నిబట్టే గ్రహిస్తాం కాని ధాత్వర్థాన్నిబట్టి కాదు. 'మతం' అనే మాటని ఫోయెర్‌బాఖ్ వాడిన రీతిని ఏంగెల్స్ విమర్శించాడు. చారిత్రకాభివృద్ధిలో సంతరించుకున్న అర్థంలోనే ఆ మాట వాడుకని గ్రహించాలి. అంచేత వాడుకలో వున్న పదం నిర్దేశించే అర్థంలోనే దాన్ని గ్రహించడం సబబు. కాబట్టి ధాత్వర్థంలో అది ఎలా వుండాల్సివున్నా వాడుకలో Dialectics కి గతితర్కం అనేది రూఢం అయింది.

శబ్ద సంభవక్రమం గురించిన 'చర్చ' కంటే ముఖ్యం అయింది రూఢ్యర్థంలో అది అందించే చింతన. అంచేత 'గతితార్కిక' పద్ధతి సాగిన క్రమదశలని చూద్దాం.

గతితర్క చింతన చరిత్రని కొన్ని ముఖ్యదశలుగా విభజించవచ్చు. ప్రాచీన తత్వవేత్తల సద్యోజనిత, సహజ గతితర్కం, (హెరాక్లిటస్, బౌద్ధ గతితర్కం లాంటివి,) పునర్వికాసకాలంనాటి భౌతికవాదుల గతితర్కం. (గియోర్డానో బ్రూనో (1518-1600) లాంటి ఇటాలియన్ తత్వవేత్తలు) ఫ్రెంచి తత్వవేత్త డిడ్రో (1713-1784) ఆధునిక గతితర్క భౌతికవాద సూత్రీకరణలకి దరిదాపుగా వచ్చేడు. తర్వాత జర్మన్ సాంప్రదాయక తత్వవేత్తల భావవాద గతితర్కం. (కాంట్, ఫిగ్టేషిల్లింగ్, హెగెల్) పంధొమ్మిదవ శతాబ్దినాటి విప్లవ ప్రజాస్వామిక వాదుల గతితర్కం (బెలిన్స్కి, హెర్జెన్, చెర్నిషేవ్‌స్కీ తదితరులు). ఆ పైన పరిణితి చెందిన ఆధునిక మార్క్సిస్టు గతితర్కం. హెగెల్ ప్రతిపాదిత భావవాద గతితర్కం మార్క్స్ పూర్వపు గతితర్కంలో శిఖరాయమానమైన దశ.

ప్రపంచం యావత్తూ, అంటే ప్రకృతి, చరిత్ర, బుద్ధి అంతా కూడా నిరంతర చలనంలో, మార్పులో, పరిణామంలో, అభివృద్ధిలో వుండే క్రమాన్ని మొదటిసారిగా సూచించడం జరిగింది. ఈ చలనాన్ని అభివృద్ధిని ఏ అంతస్సంబంధాలు ఒక యెడ తెగని సమాహారంగా చేస్తాయో వాటిని పట్టుకునే ప్రయత్నం జరిగింది. హెగెల్ సిద్ధాంతం ఎంత విప్లవకర భావాలలో భాసించినా భావవాద ధోరణివల్ల సాంఘిక సూత్రీకరణలకి చేరలేదు. మార్మికత చొచ్చుకుని అభివృద్ధి సూత్రం భావాలసీమకి మాత్రమే పరిమితమైపోయింది. రొడ్డకొట్టుడు తార్కిక అభివర్గాలు చేరి గతితర్కం వికాసం చెందే సిద్ధాంతంగా కాక మూసుకుపోయింది. హెగెల్ యథాతథస్థితిని సమర్థించాడు. కాని ప్రపంచంలో అన్నీ కూడా ఆవశ్యకతా నియమంవల్ల నాస్తీకరణ పొందుతాయి అన్న హెగెల్ సూత్రీకరణ చాలా విప్లవాత్మకమైంది. హెగెల్ ప్రతిపాదించిన సిద్ధాంతంలో భావవాద వస్తువుని తప్పించి శాస్త్రీయ పునాదిని మార్క్స్, ఏంగెల్స్‌లు ఏర్పరిచారు. శాస్త్రీయ గతితర్కం జీవిత సూత్రాలని, ప్రపంచాన్ని జ్ఞేయం చేసుకునే నియమాలని సజీవంగా మేళవిస్తుంది. చారిత్రకాభివృద్ధినీ జ్ఞానాభివృద్ధినీ భౌతిక దృష్టికోణంతో అవగాహన చేసుకుని తమ గతితర్కాన్ని నిలబెట్టారు మార్క్స్, ఏంగెల్స్‌లు.

మార్క్సిస్టు గతితర్కమే భౌతికవాద గతితర్క అత్యున్నత దశ. చారిత్రక గమనంలో పడుతూ లేస్తూ అనేక దశలు దాటిన భౌతికవాదం గతితర్క పద్ధతివల్ల పరిపుష్టమైన శాస్త్రీయ సిద్ధాంతం అయింది.

ప్రకృతి నుంచి, మానవ సమాజ చరిత్ర నుంచి గతితార్కిక నియమాలని గ్రహించడం జరిగింది. అంతేకాని ఏ మాయామంత్రంవల్లో, ఈశ్వర వరప్రసాదం వల్లో దక్కేయని అనుకోనక్కర్లేదు. దీనికి పాండిత్య ప్రకర్షక వివరణ అక్కర్లేదు. గతితార్కిక నియమాలు ప్రకృతి చరిత్ర మానవ సమాజ చరిత్ర అనే చారిత్రకాభి వృద్ధి రెండు పార్టీలకీ సర్వ సాధారణ నియమాలు. గతితర్క నియమాలు ప్రకృతిలో సర్వత్రా వున్నాయి. ఈ నియమాలు వాటంతట అవే అమలు జరుగుతూ వుంటాయి. ఈ చలనం ప్రతిఫలించిన ఆలోచనే గతితార్కిక ఆలోచన. గతితార్కిక నియమాలని గ్రహించి ఆలోచనలో ఆ దృష్టికోణం సుదృఢంగా స్థాపించుకుంటే ప్రకృతిని, సమాజాన్ని మానవ జీవితాన్ని సుసంఘటితంగా విశ్లేషించవచ్చు. శతాబ్దాల తరబడి భౌతికవాదులు తలబొప్పి కట్టించుకున్న పరిమితులనన్నిటినీ అధిగమించ వచ్చు. గతితార్కిక నియమాలు యేమిటి? పరిమాణాత్మకం నుంచి గుణాత్మకానికి, గుణాత్మకం నుంచి పరిమాణాత్మకానికి మళ్ళీ అలా అలా పరివర్తన చెందే నియమం. యిది మొదటిది. వైరుధ్యాల పరస్పర సంఘర్షణ ఐక్యం నియమం. ఇది రెండవది. నాస్తికరణకి నాస్తికరణ జరగడం నియమం. ఇది మూడవది.

ఈ మూడు గతితార్కిక నియమాలు ఫలానా ఫలానా అని సౌలభ్యంకోసం వేర్పాటుచేసి పరిశీలిస్తున్నాం. కాని అవి వేర్పాటుగా వుండవు. ఒకదానిలో ఒకటి పరస్పర సంబంధంతో వుంటాయి. మొదటి నియమం మొదటిదే, రెండవ నియమం రెండవదే అని గిరిగీసి వుండవు. అలా యెక్కాల పుస్తకం వాడినట్టు యీ నియమా అని అనువర్తింపచేసి అధ్యయనం చెయ్యబోవడమే గతితార్కిక వ్యతిరేక దోష భూయిష్ట ధోరణి.

## గతితార్కిక భౌతికవాదం

భౌతికవాద గతితర్కం వస్తువుల మధ్య సర్వసాధారణంగా వున్న సంబం ధాలనీ, వాటి అభివృద్ధిక్రమాన్నీ తెలియచేస్తుంది. గతితర్క నియమాల్లో యివి వెల్లడి అవుతాయి. భావవాదం అంటే ఏమిటో, భౌతికవాదానికి బీజం యేమిటో ఇదివరలో చూశాం. భౌతికవాదం పదార్థం ముందు అని, ఆలోచన దాన్నుంచి వచ్చిందనీ చెపుతుంది అని గమనించాం. పదార్థం, ఆలోచన యే సంబంధంతో వుంటాయో పరస్పరం మార్పులకి గురవుతూవుంటాయో గతితార్కిక భౌతికవాదం వివరిస్తుంది. ప్రకృతిలో పదార్థం ప్రకృతి గతితార్కిక నియమానుసారం చలనంలో వుంటుంది. మానవుడి మెదడు జీవ పదార్థ పరిణామపు అత్యున్నత దశ. మాన

వుడి ఆలోచన మీద పదార్థం ప్రభావం కలిగిస్తుంది. మానవుడి ఆలోచన పదార్థం మీద ప్రభావం కలిగిస్తూ ఉంటుంది. మానవుడి కార్యకలాపాలు ప్రకృతి మీద ప్రభావం కలిగిస్తూ ఉంటాయి. ఇలా పరస్పర ప్రభావితం కావించుకుంటూ సాగే పదార్థ అభివృద్ధి క్రమాన్ని వివరించేవే గతితార్కిక భౌతికవాద నియమాలు. అంటే గతితర్క నియమాలు.

నియమాలు అంటే ఏమిటో సామాన్యంగా అందరికీ తెలుసు. భౌతికశాస్త్ర నియమాలు, రసాయనశాస్త్ర నియమాలు, వృక్షశాస్త్ర నియమాలు, జంతుశాస్త్ర నియమాలు, శరీరశాస్త్ర నియమాలు అని ఆయా శాస్త్రాలని అధ్యయనం చేసే వాళ్ళందరూ వాటి గురించి తెలుసుకుని అధ్యయనం చేస్తూనే ఉంటారు. భౌతికవాద గతితర్కానికీ సాధారణ నియమాలు ఉన్నాయి. అవే పైన ప్రస్తావించుకున్న మూడు నియమాలూనూ.

ప్రకృతి గురించిగాని, సమాజం గురించిగాని అధ్యయనం చేసేటప్పుడు కొత్తది రావడం, అభివృద్ధి చెందడం మనకి కనిపిస్తుంది. పాతదాన్నుంచి ఎప్పుడూ ఏదో కొత్తది రావడం అభివృద్ధి చెందడం, ఏదో పాతది శిథిలమవడం నశించిపోవడం కనిపిస్తూ ఉంటుంది. పుడుతూ అభివృద్ధి చెందుతూ ఉన్నది ఫలవంతం కాగానే శిథిలమవుతూ ఉన్న పాతది ఆఖరికి నశించగానే నూతనమైంది వస్తుంది.

యాంత్రిక భౌతికవాదం ప్రకారం పునరపి మరణం పునరపి జననం అన్నట్టు అదే మార్పుల వృత్తం సాగుతూ ఉంటుంది. హైందవ జగత్సృష్టి భావన ప్రకారం ఇదే సృష్టి పునరావృతమవుతూ ఉంటుందని కదా. కృత, త్రేత, ద్వాపర, కలియుగాలు ఒకదాని తర్వాత ఒకటి వస్తాయి. ఇలాంటివి కొన్ని కలిసి మన్వం తరం అవుతుంది. ఇలాంటి మన్వంతరాలు కొన్ని కలిసి ఓ బ్రహ్మకల్పం అవు తుంది. తర్వాత ప్రళయం, మళ్ళీ సృష్టి. ఇలా "చక్రనేమి క్రమంబున" సాగుతూ ఉంటుంది. ఇదంతా మార్పు మాత్రమే.

కాని మార్పుకి అభివృద్ధికి తేడా ఉంది. ప్రకృతిలో వస్తువులలో అవే వస్తు వులు సర్వదా పౌనఃపున్యంగా ఉండవు. ఒకదశ నుంచి ఒకదశకి పురోగమిస్తూ ఉంటాయి. ఇది శంఖావృతంగా ఉంటుంది. ఎప్పుడూ కొత్తది వస్తూ ఉంటుంది. ఇది అభివృద్ధి. మార్పుకీ అభివృద్ధికీ తేడా అదే. అభివృద్ధి అనేది వస్తువుల అంత ర్గత చలన నియమాలనిబట్టి ఓ దశనుంచి ఇంకోదశకి పోవడం. మార్పుకీ అభివృద్ధికీ తేడా ఉన్నట్టే అభివృద్ధికీ పెరుగుదలకీ కూడా తేడా ఉంది. ఈ తేడా జీవశాస్త్ర వేత్తలకి బాగా పరిచితం అయిందే. పెరుగుదల అంటే పెద్దది కావడం. పరిమాణా త్మకమైన మార్పు అందాం.

కాని 'పరిమాణాత్మకం' అంటే పెరుగుదల అనేకాదు కదా, పరిమాణంలో తరుగుదల ఉండచ్చు కదా. అంచేత పెరుగుదల తరుగుదల అనే రెండింటినీ

కలిపే పరిమాణాత్మకం అందాం. పెరుగుదల తరుగుదల ఉన్నమార్పు పరిమాణాత్మకం అయితే అభివృద్ధి చెందడం గుణాత్మకమైన మార్పు. ఒకదశ నుంచి మరో దశకి జరిగే మార్పులో పరిమాణాత్మకమైందే కాక గుణాత్మకమైన భేదం ఉంటుంది. ఉదాహరణకి గుడ్డుదశ, డింబకదశ, కోశస్థ దశలు ఉన్నా పరిమాణాత్మక దశలు అనుకుందాం. ఈ దశలు దాటిన గొంగళీ పురుగు సీతాకోక చిలక కావడం గుణాత్మకమైన మార్పు, అదే అభివృద్ధి.

ప్రకృతిలో సమాజంలో ఒట్టి మార్పు పెరుగుదల మాత్రమేకాక అభివృద్ధి ఉంది.

మార్పులు పరిమాణాత్మకంగా సాగుతాయి. ఒకస్థితిలో వాటికి అంతరాయం వస్తుంది. నిరంతరాయంగా ఉన్నదాంట్లో ఆకస్మికమైన అంతరాయం కలిగి జరిగే అభివృద్ధిని లంఘన అంటారు. కోతి నుంచి పరిణామం చెంది నరుడు ఆవిర్భవించేడు అంటే అర్థం ఇలా లంఘనవల్ల వచ్చిన గుణాత్మకమైన మార్పు, అభివృద్ధి అనే. అంతేకాని కోతి బాగా బలిసిపోయి, లేకపోతే తరిగిపోయి పరిమాణాత్మకం అంటే అంతేకదా-రక్కని మనిషి వచ్చేడని కాదుకదా! ఈ మార్పు క్రమాల అవగాహన లేని అమాయకులే కోతినుంచి మనిషి వచ్చేడంటున్నారు. అయినా ఇంకా ఇన్ని కోతులున్నాయేమండీ బాబూ, ఇవన్నీ ఎప్పుడు మనుషులుగా మారతాయి అని అడుగుతారు! డార్విన్ సిద్ధాంతం ఈ పరిణామక్రమాన్ని వివరించింది, ఆధునిక జీవితావగాహన పునాది సిద్ధాంతాల్లో ఒకటైంది.

దీన్నిబట్టి అభివృద్ధికి సంబంధించిన సామాన్య నియమాలేమన్నాయో మనం చూడాలి. అభివృద్ధి క్రమంలో వున్న ఆ నియమాలని కనిపెట్టి అభివృద్ధి గురించి అర్థం చేసుకుని వివరించి నియతం చేసే పద్ధతిని ఇవ్వడం భౌతికవాద గతితర్క కర్తవ్యం.

గతితార్కిక నియమాలు మూడు ఉన్నటు తెలుసుకున్నాం. వీటి గురించి పరిశీలించేముందు ఓ చిన్న వివరణ ఇవ్వడం ధర్మం. ఈ మూడు నియమాలనీ అధ్యయనం చేసేక్రమంలో కొన్ని పుస్తకాలలో వైరుధ్యాల పరస్పర సంఘర్షణ ఐక్యం అనే నియమాన్ని కొందరు మొదటగా ప్రస్తావిస్తున్నారు. అంటే క్రమంలో ఇది మొదటిదిగా మిగిలినవి తర్వాతవిగా అనిపించవచ్చు. నిజానికి పరస్పర సంబంధం వున్న నియమాలలో ఇది ముందా అది ముందా అనే ఓ పంతాలు అనవసరం. అన్నీ అంతస్సంబంధం ఉన్నవే. అన్నిట్నీ సమాహారంగానే చూడాలి. అధ్యయన సౌలభ్యంకోసమే మొదటిది, రెండవది, మూడవది అనే క్రమం ఏర్పాటు చేసుకోవడం. కాని ఏంగిల్స్ "ప్రకృతిలో గతితర్కం" అన్న పుస్తకంలో ఇచ్చిన క్రమం పాటించడం విద్యార్థులకి న్యాయంగా ఉంటుంది అని ఆ క్రమాన్నే ఇక్కడ పాటిస్తున్నాను. (సశేషం)

# "కమ్యూనిజం" వ్యాసావళి (ఇండెక్స్)
# (1993 - 96)

## జనవరి 1993



## ఫిబ్రవరి 1993

### (హిందూమతం - భారతీయ సంస్కృతి ప్రత్యేక సంచిక)

## మార్చి 1993

## ఏప్రిల్ 1993

### (మహిళా సమస్యలపై ప్రత్యేక సంచిక)

అనుబంధం

## మే 1993

## జూన్ 1993

(దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ సంస్మరణ ప్రత్యేక సంచిక)

## జూలై 1993



## ఆగష్టు 1993

## సెప్టెంబరు 1993



## అక్టోబరు 1993

## నవంబరు 1993

## డిశంబరు 1993



## జనవరి 1994
### (భారతదేశంలో మతం - ప్రత్యేక సంచిక)

అనుబంధం

# మార్చి 1994



# ఏప్రిల్ 1994

## మే 1994



## జూన్ 1994

### (చంద్ర రాజేశ్వరరావు సంస్మరణ ప్రత్యేక సంచిక)

## ఆగస్టు 1994



## సెప్టెంబర్ 1994

## అక్టోబర్ 1994



## నవంబరు 1994

1-6-1996

## ఫిబ్రవరి 1995

## మార్చి 1995

## ఏప్రిల్ 1995



## మే 1995

## జూన్ 1995



## జూలై 1995

## ఆగష్టు 1995

## సెప్టెంబర్ - అక్టోబర్ 1995

(భారత కమ్యూనిస్టు పార్టీ 19వ రాష్ట్ర మహాసభల ప్రత్యేక సంచిక 1995 సెప్టెంబర్ 25-28, విజయవాడ)

## నవంబర్ 1995

# డిసెంబరు 1995

## (భారత కమ్యూనిస్టు పార్టీ 70వ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక)

## జనవరి 1996

## ఫిబ్రవరి - 1996



## మార్చి 1996



కమ్యూ...

1-6-1996



## ఏప్రిల్ 1996



## మే 1996

### (ఏటుకూరు బలరామమూర్తి సంస్మరణ - ప్రత్యేక సంచిక)

Communism (Telugu Monthly) Regd HVS/78



Printed and Published by Valluri Gangadhara Rao for Visalaandhra Vignana Samithi at Nagarjuna Enterprises, Chandram Buildings, Vijayawada-520 004, Editor: EDUPUGANTI NAGESWARA RAO

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | LPSA101M104 |
| పుస్తకం పేరు | కమ్యూనిజం |
| తారీఖు | 14 March 2025 |
| ముందు అట్ట | XCS |
| వెనుక అట్ట | XCS |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.I BcI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jyamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Saranya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |